

# స్రవంతి

* తుమ్మల సీతారామమూర్తి
* శ్రీ సునీల్ గంగోపాధ్యాయ
* డా. లక్ష్మ హీరాదాస్
* తేలివార్ సుభాష్
* సోమసుందర్
* శ్యామ్‌లాల్
* చల్లా రాధాకృష్ణశర్మ
* నందినీ సత్పతి
* సౌంధ శ్రీ
* వేమూరి ఆంజనేయశర్మ
* ఏ. వెంకటరామిరెడ్డి
* తాళ్ళపల్లి మురళీధ[illegible]
* ఎస్వీ
* వేముగంటి

# స్రవంతి

## సాహిత్య మాస పత్రిక

సెప్టెంబరు, 1980 సంపుటి 27 : సంచిక 6

వార్షిక చందా : పది రూపాయిలు విడి ప్రతి : ఒక రూపాయి

సంపాదకులు :

డా. సి. నారాయణరెడ్డి

వేమూరి ఆంజనేయ శర్మ

చిర్రావూరి సుబ్రహ్మణ్యం

# ఈ సంచికలో

# హిందీలో తెలుగు కథానికల సంకలనం

జాతీయభాష హిందీతోపాటు మాతృభాషల ప్రచారానికీ, వ్యాప్తికీ, వికాసానికీ కూడ తోడ్పడటం ఆదినుంచీ దక్షిణ భారత హిందీ ప్రచారసభ లక్ష్యమై యున్నది. ఆలక్ష్యాన్ని పురస్కరించుకొని ఆంధ్రసభ తెలుగులో దాదాపు నలభై గ్రంథాలను ప్రచురించియున్నది. గత 27 సంవత్సరాలుగా స్రవంతిని నడుపు చున్నది. ఉత్తమస్థాయి, ఉత్తమ అభిరుచిగల సాహిత్య మాస పత్రికగా స్రవంతి తెలుగు నాట మన్ననలను అందుకొనుచున్నది. స్రవంతి ప్రచురణతోపాటు గత పాతిక ముప్పది సంవత్సరాలుగా తెలుగుభాషా సాహిత్యాల వికాసానికిగాని, తెలుగు జాతి సమైక్యతకు గాని ఏ ప్రయత్నాలు జరిగినా, ఏ కార్యక్రమాలు తలపెట్టినా అన్నిటిలోను దక్షిణ భారత హిందీ ప్రచారసభ-ఆంధ్ర భాగస్వామ్యం పంచుకొన్నది. తెలుగు కవులను, రచయితలను సన్మానించిడంలోను, కవి సమ్మేళనాలు మొదలయిన వాటిద్వారా తెలుగు సాహిత్యం ఎడ ప్రజలలో అభిరుచిని ప్రోత్సహించడంలోను తెలుగు భాష సాహిత్యం వీటి విశిష్టతలను హిందీ ద్వారా ఇతర భాషీయులకు పరిచయం చేయడంలోను, ఇతర భాషా సాహిత్యాల విశిష్టతలను తెలుగులోనికి తెచ్చి తెలుగును సమృద్ధం చేయటంలోను ఆంధ్రసభ ముందంజ వేస్తూ వచ్చింది. రాష్ట్రంలో తెలుగును అధికార భాషగా చేయవలెనని సభలూ సమావేశాలు జరిపించింది. ప్రపంచ తెలుగు మహా సభలకు క్రియాత్మకంగా మద్దతునిచ్చింది. హిందీలో 'తెలుగువాణి' ప్రచురణకు ఆధ్వర్యం వహించింది. 'పూర్ణకుంభ్' హిందీ మాస పత్రికను ప్రారంభించి తెలుగు సాహిత్యం, తెలుగు సంస్కృతి-విశేషాలను ఇతర భాషీయులకు అందించుచున్నది.

ఈ విధమైన అనేక కార్యక్రమాలను చేపట్టటమే గాక తెలుగులోని మౌలిక సాహిత్యాన్ని హిందీలోనికి పరివర్తింపజేసి ప్రకటించే బృహత్కార్యక్రమా న్నొకదానిని కొన్ని సంవత్సరాల క్రితం ఆంధ్రసభ సిద్ధపరచింది. కవితలు, నవలలు, నాటకాలు-ఇలా ఒక్కొక్క సాహిత్య శాఖను తీసుకొని అందులోని

ఉత్తమమైన కృతులను హిందీలోనికి అనువదించి ప్రకటించుట ఆ కార్యక్రమ లక్ష్యం. అందులో ముందుగా 200 కథలను ఎనిమిది సంపుటాలుగా ప్రకటించడానికి ప్రణాళికను వేసి సాధన సంపత్తిని సమకూర్చుకోవడం జరిగింది. అయితే ఎంత మంచి కార్యక్రమానికైనా విఘ్నాలు, అడ్డంకులు తప్పలేదు. మొదటి సంపుటి రావడానికే దాదాపు మూడేళ్లు పట్టింది. అయినా ఈనాటికి విఘ్నాలు తొలగి మొదటి సంపుటి "గోదావరీ హాఁస్‌పడీ' (గోదావరి నవ్వింది) అన్న పేరుతో వెలువడుతూండటం ముదావహం.

హిందీ తెలుగు భాషలలో నిష్ణాతులయిన శ్రీ వేమూరి ఆంజనేయశర్మ, శ్రీ భాలచంద్ర ఆప్టే, శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తిగారలు సంపాదకులుగా ఎన్నిక చేసిన ఈ మొదటి సంపుటిలో గురజాడ అప్పారావు, సురవరం ప్రతాపరెడ్డి, చింతా దీక్షితులు, అడవి బాపిరాజు, విశ్వనాథ సత్యనారాయణ, మునిమాణిక్యం నరసింహారావు, వేదుల సత్యనారాయణశాస్త్రి, మొక్కపాటి నరసింహశాస్త్రి, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, కనుపర్తి వరలక్ష్మమ్మగార్ల కథలు ఇరువది ఉన్నాయి.

ఈ సంపుటిని రాబోవు గాంధీ జయంతి (ది. 2-10-80) నాడు ఆవిష్కరించుటకు ఏర్పాట్లు జరుగుతున్నాయి. త్వరలోనే క్రమంగా తక్కిన సంపుటాలను కూడ వెలువరించుటకు చురుకైన ప్రయత్నాలు జరుగుతున్నాయి. మా యీ కృషికి సాహితీ పరులయు, పాఠకులయు ఆదరాభిమానాలు ఎప్పటివలెనే ఉండగలవని మా విశ్వాసం.

# కృష్ణానది

తెనుఁగు
—తుమ్మల సీతారామమూర్తి

తల్లి! కృష్ణానదీ! భవత్తటమునందె
మ్రోసె నాంధ్రపతాక ముమ్మొదటి దెగసి
తెనుఁగునావలు నీదు దీవనలు వడసి
యెత్తెఁ దెరచాఁప దీవులనెల్ల నొత్తె.

ఖండఖండాల నాగరికతల మెఱుఁగు
అల్లనల్లన నీప్రజ కంటి యంటి
కృష్ణవేణీ! యుదాత్తసంస్కృతి యొకండు
వెడలె భవదగారమ్మున విశ్వహితము.

సుకృతఖనివి నీవు సకలభూములవారి
యర్చ లందు మల్లికార్జునుండు,
కనకదుర్గ నీకు గాదిలిచుట్టమ్ము
లగుటకతన సహ్యనగతనూజ!

నీ కెలంకులు ధనధాన్య నిర్భరమ్ము
లిహపరానందకృత్కలా మహితపదము
లార్తసేవనదీక్షా పరాయణములు
జనని! కృష్ణాధునీ! నీకు సవతు కలదె!

నీవు కరుణానిధివి కాన నీతటమ్ము
లాశ్రయము లయ్యె బౌద్ధవిహారములకు
సుగతసంస్కృతి నిపుడేని పగటు నిచటి (ప్రకటించు)
జనత; పున్నెంపుదొంతి! కృష్ణా స్రవంతి!

వాసిరెడ్డివారు నీ సన్నిధిన్ బ్రజ
నేలునాఁడు లోకహితము నెంచి
విడుచు దానధార వడకారునందేని
నింపె నీకు వఱద సొంపు కృష్ణ!

—౦—

# చాలా రోజులెందిచూచి

బెంగాలీ మూలం :
**సునీల్ గంగోపాధ్యాయ**

తెలుగుసేత :
**గుంటూరు శేషేంద్రశర్మ**

చిరిగిన బట్టలు, చెరిగిన జుట్టు, మేకులు ఊడి పోతున్న చెప్పులు....ఒక కుర్రవాడు....ఎక్కడికి వెళ్ళిపోయాడో ఆ కుర్రవాడు!

జేబు నిండా చెకుముకి రాళ్ళు, మిట్ట మధ్యాహ్నం కానీ అర్ధరాత్రి కానీ పరుగులెత్తే ఆలోచనలు, పాదాల్లోతిరిగే దాహం, అనుక్షణమూ ఆకలి....

రంగురంగుల మొక్కలు తొక్కుతూ ఒకే ఆకలి మంటగా జ్వలిస్తూ నడుస్తూ పరిసరాల్లో అతడు భాగ్యరాసులు ఎదుర్కొంటాడు.

అరే! ఉద్యానవనాల్లో కూడా శౌచాలయ సౌకర్యాలు, ఆఫీసుల్నించి వచ్చి పోర్టికోల్లో తమ బూట్ల మధుర ధ్వనులు విని పరవశించే బంగళాలు, గుడిసెలు నిర్మూలం చేసివేసిన రాస్తాలు ఎన్నో అన్నీ అంతిమయాత్రకు దారిచూపే రాస్తాలు!

ఈ మనోహర సౌందర్య కేంద్రంలో నుల్చుని అక్షుధాగ్ని జ్వాలామాలిక వేసుకున్న యువకుడు ఉచ్చైస్వరంతో ప్రకటిస్తాడు నేనున్నాను— నేనిక్కడ ఉన్నాను.—

ఆ కుర్రవాడు ఎక్కడికి పోయాడు? ఎక్కడికి పోయాడో అతడ్ని చూచి యుగయుగా అయినట్లనిపిస్తోంది.

ఎంత సిగ్గు అతడికి! ప్రాణాస్పదంగా ప్రేమించిన ఇంటికి వెళ్ళి తెల్లటి 'ఫ్రాకు'లో షోకయిన ఒక రాజహంసలా సోపాన పంక్తుల మీద నిల్చొ ఉన్న శృంగారాకృతిని చూచి ఒకమాట కూడా చెప్పలేకపోయాడు ఎక్కడో వక్షస్సీమల్లో ఒక రహస్య ధ్వని అంకురించి కంపాయమానమవుతుంది మాటి మాటికి—పెదవులు మాత్రం విరియని ఒక మొగ్గలాగే వుంటాయి!

కానీ అతడి అంతర్లోకాల్లో ప్రసవించిన ధ్వనులన్నీ విస్ఫులింగాలై ఎగిరిపోతాయి. అతడు రాసే అక్షరాకాశాల్లోకి రెక్కలు తొడుక్కుని.... ఆ అక్షరాల గుంపులన్నీ ఉద్రేకం తాగి వాక్యాలై విషాద గీతికలై ఏవో కొన్ని అప్రసిద్ధ మాస పత్రికల పేజీల మూలల్లో పడి నిదురిస్తాయి.... చిన్న చిన్న డబ్బీల కడుపుల్లో దూది పొరల్లో నిక్షిప్తం చేసిన విత్తనాల్లా మెల్లగా ఎదుగుతుంటాయి—ఏ విత్తనాల్లో నుంచి ముందొక వృక్షం రావాలో ఏ పూలు పూయాలో ఏ పండ్లు కాయాలో ఒకవేళ పూస్తే కాస్తే.....

లేకపోతే—ఒక్కోసారి అనుకోని వేళ కత్తుల ఖేల! ఒకదానివెంట ఒకటి, దొంగ, పోలీసు, బందిపోటు యిలా ఆ కఠిన కుడ్యాలన్నీ సమీపిస్తాయి తన శిరస్సు మీదికి గురిపెడుతూ! ప్రాణాలొడ్డి పోరాడుతాడు, ఏకాకిగా కానీ మిత్రుల సహాయంతో కానీ—

అరుస్తాడు అర్ధరాత్రి ఆకాశం చీల్చినట్లు, 'నేనున్నాను నేను ఇక్కడ ఉన్నాను'...

కావలిస్తే ఎవరైనా సరే తీసుకోవచ్చు తన అపవిత్రమైన అర్ధ భాగాన్ని, కానీ తన పవిత్ర భాగం ఏదైతే ఉందో కఠోర జీవనసమరం ఎదుర్కొడానికి ఎందులో తన రెండు పాదాలు ఊని నిల్చోవాలో, అది మాత్రం ఒక్క అంగుళం కూడా ఎవ్వరికీ వదలడు! సీమల్ని పరిహద్దుల్ని భగ్నం చేసే ఆక్రోశంతో రాత్రిని చీలుస్తూ కేకవేస్తాడు—'నేనున్నాను నేనిక్కడ ఉన్నాను'....

(ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం సౌజన్యంతో)

# ఎక్కడా ధ్వని

అస్సామీ మూలం :

**డా॥ లక్ష హీరాదాస్**

తెలుగు అనువాదం :

**కుందుర్తి ఆంజనేయులు**

దూరంగా ఫెళఫెళా చెట్లుభూమ్మీదకూలిపోతు
న్నట్లు
దగ్గరగా పిడుగులు వచ్చి పిలుస్తున్నట్లు
పెద్దలూడి పాతగోడలు విరిగి పడుతున్నచప్పుడు
ఎక్కడిదా ధ్వని?
ఏదిక్కు నుంచి వస్తున్న దివ్వుడు?

నేల మీది నింగి మీద పరచుకుని పారాడుతున్నది
చప్పుడు
వచ్చిక మైదానాల ఒడళ్ళు జల్లుమంటున్నవి
వల్లెల, పట్నాల చెవులు చిల్లులు పడుతున్నవి
రోడ్లమీద అదే, చెట్ల కొమ్మల అంచుల మీద అదే
నదులమీద అదేశబ్దం సముద్రం నిండా అదేమ్రోత
పెద్దలూడి పాతగోడలు విరిగిపడుతున్న చప్పుడు
ఎక్కడిదాధ్వని? ఏదిక్కునుంచి వస్తున్నదివ్వుడు?

నింగి నిప్పంటుకున్నట్లు ఎర్రగా వణికిపోతున్నది
పూర్వీకులు యిచ్చిపోయిన మా పూరింటికప్పు
ఎగుర్తున్న తాటాకులవంక ఏగాదిగా చూస్తున్నది
చెప్పులో భద్రంగా ఉన్న అరికాలు కదలకుండా
బెదికిపోతున్నది
కాళ్ళ కింద భూమాత కంపించి పోతున్నది.

స్తున్న ఒక గొంతు వేస్తున్న కేకలు
దూసుకుపోతున్నాయి, దుఃఖంలాంటి చిమ్మ
చీకటి గర్భంలోకి

వంటింటి దొంగకు చేయాడకుండా చేసిన పెంపుడు
కుక్క అరుపులు
మోసుకుపోతున్నాయి, మోసాన్ని శ్మశాన
గర్భంలోకి.

నావేపు మెల్లిగా అదో, నడుస్తూ వస్తున్నదాధ్వని?
ఓరి నీపిచ్చి పాడుగాను, అడుగుతావేమిటి దాని
పేరేమిటని

ధ్వనులకు పేర్లుంటాయా?
వీస్తున్న గాలికి దార్లుంటాయా?

నాలోనివాడుమేలుకున్నాడు, నాకంటే పెద్దమనిషి
తాటిచెట్టంత, నన్ను తలదన్నేవాడు వాడు
నాలో మండే రేపుకు నిజమైన రేడు వాడు

వాడు చూసే వాడిచూపుల్లో. ఏదో వరదొచ్చి
కొట్టుకు పోతున్న జాడ
వాడి తెల్లని ముఖం మీద ఏదో పరుగెత్తిపోతున్న
నల్లని భూతం నీడ
ఎగిరే మోసాల గాలిపటాల వెంబడి పడి దారాలు
తెంచేస్తున్నాడు
పంట వలతి చెక్కిళ్ళ మీద స్వేదాంబువులు
చేత్తో తుడిచేస్తున్నాడు.
వాడు కేకేసి పిలుస్తూ నాకేదో వాగ్దానం
చేస్తున్నాడు
వాడు విసిరిన వెలుగా యీధ్వని?
కూకటి వ్రేళ్ళతో కూల్చే పదునైన వలుగా
యీధ్వని?

నావైపే వస్తున్నది— గుండెలో ధ్వనిస్తున్నది
కంటికి బాగా వినిపిస్తున్నది మెదడుకు
కనిపిస్తున్నది
వచ్చేశాడు వచ్చేశాడు మహాప్రభువు విచ్చేశాడు
గాలిలా రివ్వున నావేపు పరుగులుతీస్తూ గతాన్ని
వెనక్కు తోసేశాడు.
తనతోపాటు నేనూ వడివడిగా
నాగుండె గుహలోకి దూరి చూద్దును గదా.....
పూరింటి కప్పు పూర్తిగా నేలకూలింది
పాతకాలపు మట్టిగోడలు విరిగి పడిపోయాయి
కాళ్ళన్నీ తెగిపోయాయి, తాటాకులు
ఎగిరిపోయాయి
ఇంకా ఇంకా లోపలికి వెళ్ళి చూద్దును గదా
ఇందాక నుంచీ వింటున్న ధ్వని
ఎక్కడో దూరాన కానే కాదు
నాలోదే
మనలోదే
మారుతున్న మనుషుల్లోదే

(ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం సౌజన్యంతో)

# ఇమ్యాజిన్

—తేలివార్ సుభాష్

ఆకాశకన్య మెడలో అక్కడక్కడ
వ్రేలాడుతున్నవి నక్షత్రాలు
ఖరీదైన అరక్త ముత్యాల ఒంటిపేట హారాల్లాగ.
వాటి సాయంతో
పగిలిపోయిన వెలుతురు ముక్కలని
కూర్చుకొని కూర్చున్నాను
ఏమి చేయాలో దిక్కుతోచక
కెమెరా చూపులను అటుకేసి పారేసి
ఒంటరిగా—
ఏమైందో ఏమో!
ఉన్నట్లుంది కొన్ని చుక్కలు తెగి
కోపంగా భూమ్మీదికి వస్తున్నవి
ఎర్రగా మారుతూ—
—వేగంగా
దూరాన హృదయాల్లేని పర్వతాలపై,
కొండల మీద
పడిపోయినవి పిడుగులా
ఏవో వింత ధ్వనులను చేస్తూ
మరునిముషం
అంతా మామూలే.
అన్నివైపులా నిశ్శబ్దం, ప్రశాంతం.
ఏదో జరిగిందనే విషయం కూడా
ఎవరికీ తెలియనట్లుంది
అందరూ నడుస్తున్నారు
పరుగులాంటి నడకతో
ఏవీ జరగనట్టు
అతికష్టం మీద వారి నాపిచూస్తే
ఆశ్చర్యం!
అందరి వదనాల్లోనూ ప్రసన్నత
మృత్యువు చిరునవ్వులు వారి కళ్ళలో
గూడుకట్టుకొనే ధైర్యంలేక ఎటో పారిపోయినవి
తృప్తిగా గుండెల నిండా గాలిపీల్చుకొని
తిరుగు ముఖం పట్టి నాదారిన నేను వచ్చేసినాను
ఇక చేయవలసిందేమీ లేక

—o—

# మాలపల్లి నవలపై ప్రభుత్వ నిషేధాలు :

# ఒక అద్భుత పరిశోధనా పత్రం

**—సోమసుందర్**

ఈ దేశం తన స్వాతంత్ర్యంతో పాటు జనసత్వాలన్నిటినీ కోల్పోయింది. సంస్కృతి శిథిలమై పోయింది. సంకీర్ణ మూఢాచారాలు భయవిహ్వలమైన జాతికి ఆరాధ్యాలయ్యాయి. అట్టి స్థితిలో మన సంస్కృతిని పునరుద్ధరించి, ఆధునిక నాగరక దేశాల స్థాయికి జీవితాన్ని పునర్నిర్మించడానికి మహత్తర కృషి సల్పిన వారెందరో మహానుభావులు. అట్టివారిలో తెలుగువారి పెన్నిధులు ముగ్గురు; యుగపురుషుడు కందుకూరి ప్రథమ గణ్యుడు. ప్రజల భాషోద్ధారకుడు మహాకవి గురజాడ ద్వితీయుడు. సజీవ నవల నందించిన ఉన్నవ లక్ష్మీనారాయణ మూడోవారు.

యుగపురుషుడు తన యావత్కాలాన్నీ సంస్కరణోద్యమానికే వినియోగించాడు. తెలుగు సాహిత్యం అంతకు ముందెన్నడూ ఎరుగని వివిధ ప్రక్రియలకు ప్రారంభకు డయ్యాడు. బండ తెలుగు గ్రాంథికాన్ని నవనాగరక మొనర్చే భాషా సంస్కరణకూ, సృజనాత్మక కళా సంపదను వెలార్చడానికీ గురజాడ తన జీవితాన్ని ఒడ్డాడు. కాని వీరిరువురూ జమీందారీ ప్రభువులపైనా, బ్రిటిష్ ప్రభువులపైనా భక్తిశ్రద్ధలు ప్రకటించుకొన్నవారే! కాని ఉన్నవ వారు మాత్రం సర్వాత్మనా విప్లవకారుడు. హైందవ సమాజంలోగల అంటరాని తనాన్ని నిర్మూలించాలనే ఉదారవాదంతోనే గాక, 'పనివాండ్లందరు ఏకమైతిరా ప్రపంచమే మీది!' అనే కారల్‌మార్క్స్ పిలుపుకు ప్రప్రథమంగా తన సాహిత్య కళాత్మక కంఠాన్ని శ్రుతి కలిపిన వాడు. తద్వారా వర్గచైతన్యానికీ విప్లవ కార్యక్రమానికీ ఆద్యుడైనవాడు.

అస్పృశ్యతా నివారణకు పీలగొంతుతోనైనా ప్రారంభకుడు గురజాడవారే! వేంకట పార్వతీశ్వర కవుల మాతృమందిరం అనే సృజనాత్మక నవలలోనూ యిదే మౌలికాశయానికి కేంద్రీకరణ జరిగింది. కనక అస్పృశ్యతా నివారణ అనేది మాలపల్లి నవలకు గౌణమే గాని ప్రధానం కాదు. ఉన్నవ దర్శనం ఆ పరిమితికి యిమిడేదీ కాదు! సామాజిక ఆర్థిక రాజకీయ సమధర్మ ప్రతిష్ఠాపనా మహాక్రతువే ఉన్నవ చరమ లక్ష్యం!

శిల్పం దృష్ట్యా, సంవిధానం రీత్యా ఆధునిక నవలా సాహిత్యానికే ఉన్నవ పితృతుల్యు డయ్యారు. అంతర్జాతీయంగా ఆనాటికి నాగరిక దేశాల ఉత్తమ నవలా సాహిత్యంతో సమఉజ్జీగా నిలవగలిగిన నవల మాలపల్లి. తెలుగుజాతి అదృష్టవశాత్తూ దానిని ఉన్నవ సమర్పించారు. సమకాలీన సమాజంలో కళవళ పడుతున్న సమస్త భావాలకూ, సర్వ సమస్యలకూ మాలపల్లి దర్పణం పట్టింది. అట్టిది ప్రజల జీవద్భాషలో వెలువడ్డం ఆశ్చర్యం కాదు. ఆ నవల వ్యావహారికంలో రాయబడక పోయినా, బ్రిటిష్ ప్రభువులు వారి తాబేదారులు దానిశక్తి గుర్తించకపోయినా, నిషేధం విధించకపోయినా అబ్బురంగా చెప్పుకోవాలసిందే!

ఇప్పటికే మనం మాలపల్లిని చదువుతుంటే-ఇంత సాహసవంతంగా దానిని ఉన్నవ ఎలా రచించారా అని ఆశ్చర్యపోతాం! కనుకనే అది కేవలం ఒక ఉత్తమ సాహిత్య గ్రంథమే కాదు; స్వయం ప్రకాశకమైన ఒక మహోద్యమ నాయకమణి! ఆధునిక సాహిత్య చరిత్రలోనే అపరూప సంఘటనగా చరితార్థమైంది.

**చీకటిలో పుట్టిన వెలుతురు కిరణం:**

మాలపల్లి జననం రాయవేలూరు శ్రీకృష్ణ జన్మస్థానంలో పలనాటి అవని పుల్లరి ప్రజోద్యమ నాయకత్వంతో ఏడాదికాలం విడి ఖైదు శిక్ష పొంది ఉన్నవ నిర్బంధితులైన దశలో! ప్రబల కష్టసుఖాలతో పాటు పంచకోశాల ఆర్ద్రతతో, నిరంకుశత్వాన్ని ప్రతిఘటించే వజ్ర సంకల్పంతో, మహోద్యమ స్ఫూర్తితో రాటుదేరిపోయి ఉన్నవ హృదయం. తనలో పొరిగే మహోద్రేకాలన్నింటినీ క్రూడ్ గానూ, కోర్స్ గానూ బయటపెట్టక సంయమబుద్ధితో కళామయ మొనర్చుకునే విపక్ష వారి హృదయంలో పూంజీభవించింది. సామాజికుల హావభావ విశేషాలను వారి దర్శన పట్టుకోగలిగింది. అనూన భారతీయ సంప్రదాయంలో పోకార్చుకోవలసినదేదో, కాపాడి వారసత్వంగా అందించవలసిన దేదో గుర్తించుకోగల శేముషి వారి మనసు సిద్ధింప చేసుకుంది తాను చేపట్టిన నవలా ప్రక్రియను ఒక ముడిసరుకుగా కాక, కావ్య ధర్మాలకు ఉన్నతీకరించి ఆయత్తం చేసే కళాభిజ్ఞతను వారి అధ్యయనమూ, వివేకమూ సముపార్జించుకున్నాయి.

ఈ గుణాలన్నీ కేంద్రీకృతం కావడంవల్లనే మాలపల్లి వస్త్వైక్యతకు కాణాచిగా నిలిచింది. నాటకీయతకు, సంఘటన నిర్మాణ దక్షతకు ప్రాధాన్యత వహించింది. కథా ప్రణాళికను, పాత్రల శీల పరిశీలనను తమ కన్నులముందు తుణ్ణంగా సాక్షాత్కరింప చేసుకున్నారాయన! ఈ మానసిక సంభారంతో రాయవేలూరు సెంట్రల్ జెయిలు ప్రవేశించారు. వారికా శిక్ష పడకపోతే ఈ నవలా రచనకు కావలసిన తీరిక లభించి ఉండేదే కాదేమో! ఆ విధంగా నిరంకుశ బ్రిటిష్ ప్రభుత్వ తాబేదారులు తెలుగు జాతికి శాశ్వత ఉపకారం చేశారు. లభించిన సదవకాశాన్ని సద్వినియోగపరచిన ఉన్నవ చిరతర గౌరవభాజను లయ్యారు.

**ఏండర్‌సన్ సూనృతం :**

నిరంకుశ పాలకుల జెయిలులో ఒక ఖైదీ నవల రాసుకుంటానంటే-అంగీకరించిన సూనృతానికి జెయిలు సూపరింటెండెంటు మేజర్ ఏండర్‌సన్ నిజంగా శ్లాఘనీయుడే! ఆ ఖైదీ విద్యాధికుడూ బారిస్టరూ కావచ్చు కాక; గౌరవప్రద రాజకీయ డెటిన్యూ కాక మామూలు నేరస్థునివలె శిక్ష పొందిన వాడాయిరి! రాతలకీ కోతలకీ అవకాశంలేదు పొమ్మంటే మాలపల్లి రచింపబడేదేనా! రాసిన దానినల్లా శుద్ధప్రతి రాయడానికి మాడభూషి నరసింహాచార్యులనే సహచరుడు లభించడమూ, జెయిలు నుంచి ఆ ప్రతిని స్మగుల్ చేయగలగటమూ, ఇవన్నీ చరిత్రలో చిరస్మరణీయాంశాలు! ఈ మహత్తర నవల అవతరణకీ జీవితానికి ఎంతో చరిత్ర ఉంది. ఒక మహోద్యమ స్థాయిగా అటు పాలకవర్గమూ, ఇటు పాలితులూ మనసారా గుర్తించారు.

ఏభయి అయిదేళ్ళ క్రితం జరిగిన ఆ చరిత్రనంతా దురదృష్టవశాత్తూ కాలం తన కర్కశ హస్తంతో దాచేసింది. తరం నుంచి తరానికి అందకుండా వెర్రి తొందరలో మనల్ని కట్టివేసింది. ఆధునిక సంస్కృతికే శిరోభూషణ మనదగిన మాలపల్లి నవలను యువతరం తెలుగు పాఠకులు ఎందరెరుగుదురు ? ఎరిగిన వారికైనా ఆ నవల చరిత్రలో పూర్వాపరాలకు సంబంధించిన యింత కథా కమామీషూ ఉందన్న సంగతి తెలుసుకున్న వారెందరు?

**బంగోరె సాహసయాత్ర :**

ఇట్టి స్థితిలో శ్రీ బంగోరె సాహసోత్సాహాలతో ప్రభుత్వ ఫైళ్ళనుంచి త్రవ్వితీసి ఆ చరిత్రనంతా జాతి కందించ బూనడం నిజంగా స్తుతిపాత్రం! బంగోరె యిదివరకే కన్యాశుల్కం ప్రథమ ముద్రణకు సంబంధించిన పత్రాలను పరిశోధించి ప్రచురించారు. తెలుగుజాతి నోముల పంటగా వెంచేసిన బ్రౌను మహర్షి జీవితాన్ని, తెలుగు సాహిత్యాని కాయన అందించిన ఉదాత్త సేవల్ని సమగ్రంగా పరిశోధించి చాటుదేరారు. ఆధునిక సాహిత్య పరిశోధకుయిగా దీక్షా హృదయంతో నిష్కామ కర్మకు పూనుకొని అగ్రపీఠి నందుకున్నారు. అలాంటి స్మరణీయ చరిత్రను నిర్మించుకొన్న బంగోరె ప్రస్తుతం 'మాలపల్లి నవలపై ప్రభుత్వ నిషేధాలు' అనే పరిశోధనా గ్రంథం ప్రచురించి తెలుగు జాతికి మహోపకారం చేశారు. అటు మాలపల్లిని గాని, దానిపై వెలువడిన సాధికార పరిశోధనాగ్రంథాన్ని గాని చదవనివారు ఆధునిక నాగరికులనిపించుకుందుకు అర్హులు కారు. కనీసం దేశభక్తు లసలే కాదు!

బ్రౌణ్యారణ్యకోపనిషత్తును అన్వేషిస్తూ శ్రీ బంగోరె గవర్నమెంటు ఫైల్సులో లోతులకు పోతూండగా, మాలపల్లి నిషేధానికి సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలు కంటబడ్డాయి. ఈ విషయానికి బంగోరె హృదయం ఆకర్షితమైంది. దొరికిన త్రాటినో, తాటాకునో పట్టుకొని అఖాతాలను తడుముకుంటూ లోతుకు పోయాడు. బ్రిటిష్ ప్రభువులూ, వారి తాబేదారులు దయతో ఒదిలిన ఫైళ్ళ కీకారణ్యంలో ఏకాకి పాంథుడై సాహసయాత్ర సాగించాడు శ్రీ బంగోరె. ఈ జాతి దాదాపు విస్మరించిన చరిత్రనంతా వెలికి తోడాడు. నిషేధపు టుత్తరువుల తరువులన్నీ ఛేదించి దారి సుగమం చేశాడు. ఆ కథనంతా ఎంతో పఠనీయంగా అమర్చి మేలు కాగితంపై చక్కగా ముద్రించి అందించాడు.

(ప్రకాశకులు: శ్రీ బంగోరె: విక్రేతలు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హవుస్, విజయవాడ 4; నవోదయ పబ్లిషర్సు విజయవాడ 2; 1/8 డెమ్మి మొత్తం 172 పుటలు; ఐదు ఫొటో స్టాట్ బ్లాకులు. వెరసి పదహారు రూపాయలు మాత్రమే!).

ఇంత అమూల్య గ్రంథాన్ని ఈ రచయిత తన సొంత ఎల్. ఐ. సి. పాలసీపై అప్పుతీసుకుని ముద్రించాడు. లాభాపేక్ష లేకుండా ఇంత చౌకగా అందిస్తున్నాడు.

**తిలకమూ: తిలకాష్ఠ మహిష బంధమూ:**

వయోవృద్ధులూ ఉన్నవ వారికి సమకాలికులూ శ్రీ దిగవల్లి వేంకటశివరావు 'నిషేధానికి నేపథ్యంలో పని చేసిన శక్తులు' అనే శీర్షికతో తిలకాయమానమైన ఉపోద్ఘాతం రచించారు. గోచరించే విషయ మేమంటే స్వతంత్రం లభించి ముప్ఫయిరెండేళ్ళు గడచినా, ఆంధ్రప్రదేశ్ ఏర్పడి ఇరవై మూడేళ్ళు గడచినా బ్రిటిష్ పాలనా కాలంనాటి తెలుగు దేశానికి సంబంధించిన రికార్డు లింకా తమిళనాడు ప్రభుత్వ బందీలై మద్రాసులో ప్రవాస శిక్షలో మ్రగ్గుతూనే ఉన్నాయి. వీటిలో కొద్దిగా మాత్రమే హైదరాబాద్ ఆర్కైవ్స్‌కు తరలించబడ్డాయి. వీటిని గురించి మన ఆంధ్ర ప్రభుత్వ పాలకులు పట్టించుకోరు. విశ్వవిద్యాలయాధికారులకు అవసరంలేదు పి.హెచ్.డి. విద్యార్థులకు బాధ్యత లేదు. అలాంటి అనాథప్రేత సంస్కారానికి అమోఘ దీక్షతో కృషి సల్పిన బంగోరెని దిగవల్లి వారెంతో మెచ్చుకున్నారు.

1920 లో ఏర్పడిన ద్వంద్వప్రభుత్వం ఎంత లోపభూయిష్టమో-బ్రిటిష్ ప్రభుత్వం నియమించిన సైమన్ కమీషను రిపోర్టులే వెల్లడించాయి. ఆ అల్ప ప్రాతినిధ్యంగల ప్రభుత్వంలో జస్టిస్ పార్టీ ప్రముఖులంతా తెవిణీ వేశారు. జస్టిస్ పార్టీ అంటేనే జమీందారుల పార్టీ; వారి తాబేదారుల పార్టీ; జోహుకుం

దారుల పార్టీ; దేశభక్తులకు వ్యతిరేకంగా బ్రిటిష్ సామ్రాజ్యా వాదానికి కొమ్ముకాసే వంతదారులంతా ద్వంద్వ ప్రభుత్వంలోని కెగబడ్డారు. ఈ దుర్మార్గ ప్రభుత్వ స్వరూపాన్నే తృణీకరించి గరిమెళ్ల సత్య నారాయణగారు – మా కొద్దీ తెల్లదొరతనమూ అనే ప్రఖ్యాత గీతం రచించి ఎన్నో శిక్ష లనుభవించారు. రాజకీయ కార్యకర్తలు సామాన్య నేరస్థులవలె క్రూర శిక్షలకు గురిచేయబడ్డారు. జస్టిస్ పార్టీ శాసన సభ్యుడు రావుబహదూర్ కోపెలమూడి గోపాల కృష్ణయ్య ఈ శిక్షలను బహిరంగంగానే సమర్థించాడు.

"స్వరాజ్యం వచ్చిన తర్వాతనూ అంతకు పూర్వం మున్నూ జరిగిన కాంగ్రెస్ పాలనలోకూడ భూస్వామ్య ధనికవర్గాల వారి పలుకుబడి తగ్గలేదు." అన్నారు దిగవల్లివారు. వారే మరోమాట కూడా అన్నారు. "అట్టి పరిస్థితుల్లో ఉన్నవవారు అనాలోచితంగా ఒక పొరబాటు చేశారు. మద్రాసులోనూ ఆంధ్రదేశం లోనూ బ్రాహ్మణేతరోద్యమం ప్రబలంగా సాగుతూం డగా, భూస్వామ్య ధనిక వర్గాలలో ప్రముఖులైనవారు జస్టిస్ పార్టీ రూపంలో బ్రిటిష్ పాలకులతో ఏకమై ప్రభుత్వం వహించి ఉండగా, అందులో ముఖ్యపాత్ర వహించిన గుంటూరు కృష్ణాజిల్లాలలోని కమ్మవారి కులాభిమాన మహోద్యమం విజృంభించి ఉండగా, ఒక బ్రాహ్మణ గ్రంథకర్త ధనిక భూస్వామ్యవర్గాల ధనాంధతను నిరంకుశత్వాన్ని ప్రదర్శించడానికి కల్పించిన కథా విధానంలో చౌదరయ్యను పాత్రగా చేయడం ఎంత పొరబాటు పని!" అని ప్రశ్నించారు శ్రీ దిగవల్లి! ఏ బ్రాహ్మణ జమీందారునో సృష్టించి ఉంటే ఏ చిక్కూ లేకపోయేది అని కూడా సూచిం చారు. ఈ అధిక్షేపంలోని వ్యంగ్యవైభవం తెలుస్తూనే వుంది!

బ్రాహ్మణ వ్యతిరేకోద్యమ నాయకులైన కోపెల మూడివారు గాని, సర్ కూర్మా వెంకటరెడ్డి నాయుడు కాని మాలపల్లి నిషేధానికి తెరవెనుక నుంచి తమ పలుకుబడి వినియోగించే ఉండవచ్చు. దానికి సాక్ష్యా ధారాలూ బంగోరె చూపాడు కూడ! కాని దిగవల్లివారు భావించినట్లు–కేవలం బ్రాహ్మణ వ్యతిరేకతే మాలపల్లి నిషేధానికి కారణమైందనడం న్యాయమూ కాదు; సత్యమూ కాదు. పైగా హాస్యాస్పదం గూడా! కారణ మేమంటే ఆనాటి సామాన్య ప్రజలలో శ్రామికవర్గ చైతన్యం కలగకపోవచ్చు కాని, పాలకవర్గంలో మాత్రం ధనస్వామ్యవర్గ వర్గస్వలాభాపేక్ష నిర్ణాయక శక్తిగా ఉందనడం సత్యదూరం కాదు. ఆనాటి ప్రభుత్వ వర్గీయులు ఏకోన్ముఖంగా మాలపల్లి శక్తి గురించి విశ్వసించిన అభిప్రాయాన్ని ఈ క్రింది వాక్యం ఎంతో గాఢంగా ప్రతిబింబిస్తుంది: "Passages (of Malapalli) incite feelings of contempt for and hatred against the Govt. and extol Bolshivism to the Skies as the Kingdom of Heaven on Earth and as the only panacca for all the evils now excisting whether Social, political, or economic. (P. 104 Remarks of the Telugu Translator).

దీనినిబట్టి మాలపల్లి నిషేధానికి వర్గవైరుధ్యమూ, స్వాతంత్ర్య పోరాట వ్యతిరేకతలే ముఖ్య కారణాలనీ, బ్రాహ్మణ వ్యతిరేకతే ననడం న్యాయం కాదనీ తెలుస్తుంది. ఆనాటి జస్టిస్ పార్టీ వీరుల ప్రధాన జీవనాడి బ్రాహ్మణ వ్యతిరేకతే; సందేహం లేదు. కూర్మా వెంకటరెడ్డినాయుడు ఉపన్యాసాలలో బ్రాహ్మణ వ్యతిరేక తీవ్రత ఎంతగా వ్యక్తమయ్యేదో నేటికీ కథలుగా చెప్పుకుంటూనేవుంటారు. తత్ఫలితంగా వారికి బ్రాహ్మణేతరుల అండదండలూ లభించి వుండవచ్చు. కాని అదే ఉన్నవ వారి మాలపల్లి నిషేధానికి ప్రధాన కారణ మనడం మాలపల్లి ఔన్నత్యాన్ని కించపరచ డమే! శ్రీ దిగవల్లి తెలియక చేసిన ఈ తప్పిదంవల్ల మాలపల్లిపై అగౌరవ భావం ఏర్పడే ప్రమాదం ఉంది.

జయంతిపురం రాజా శ్రీశ్రీశ్రీ వాసిరెడ్డి దుర్గాసదా శివేశ్వర ప్రసాద్ బహద్దర్ సైతం 'మాలపల్లి నిషేధానికి కోపెలమూడి గోపాలకృష్ణయ్య తెరవెనుక పని చేయడమే కారణమని యువలెనే శ్రీ దిగవల్లితో సాక్ష్యం పలికి ఉండవచ్చు గాక! అంత మాత్రంలోనే రాజకీయ వర్గ వైరుధ్యాది మౌలిక కారణాలను విస్మరించడం, కులతత్వ నైచ్యానికి మాలపల్లిని దిగజార్చడం—శ్రీ దిగవల్లి ఆత్మాభిమానంతో చేసిన చతురతా రాహిత్యమే!

'నా యాంగిల్ నుంచి....'అనే శీర్షికతో సుప్రసిద్ధ విమర్శకుడు శ్రీ కె. వి. రమణారెడ్డి పదిహేను పుటల పీఠిక సందించాడు. "తాను కమ్యూనిజం అనుకున్న దాన్ని తన నవలలో ప్రముఖంగానూ, ఆకర్షణీయంగానూ చిత్రించడానికి వెనుకాడలేదు; సరేకదా కమ్యూనిజం ప్రచారం చేయడం నేరమేమీ కాదని ధైర్యం చేసి చెప్పడానికికూడా వెనుదీయలేదు...."అని ఉన్నవ అభిప్రాయాలను పట్టిచూపాడు. (పు. XVIII) కాని తానే మళ్ళీ-'ఉన్నవతోనే కమ్యూనిజం ప్రచారం మొదలైందని చెప్పటంచారిత్రకంగావాస్తవముకాదు." అన్న విమర్శకునికి, తత్పూర్వం ఏ సాహిత్య కళా ప్రక్రియలోనికి కమ్యూనిజం, బోల్షివిజం తెలుగులో ఎక్కి రాగలిగిందో నిరూపించవలసిన బాధ్యత వుంటుంది. వారాపని చేయలేదు. మాలపల్లి రచనా వ్యాసంగానికి ఉన్నవ కృత్యాద్యవస్థలో ఉండగా భారతదేశం నలుమూలలా కమ్యూనిస్టు సిద్ధాంత కాంతులు మంద మందంగా వ్యాపిస్తూ ఉండవచ్చు! వాని ప్రభావంవల్ల కాని, తాను పాశ్చాత్య దేశాలలో పర్యటించి పచ్చినస్వీయానుభవ రేఖలవల్ల కాని,తెలుగు దేశీయ జమీందారీ భూస్వామ్య వలస పాలనా ధనిక వ్యవస్థకు పట్టించి అసమవర్గ వర్ణ వ్యవస్థను ఖండించి నవీన దర్శనంలో పరిశీలించి, కమ్యూనిజమే ఒక పరిష్కార మార్గంగా శ్లాఘించి, నేర్పుతో పాఠకులను ఒప్పించి పాత్రగతంగా చిత్రించగల ప్రపథమ ధైర్యశాలి. సమర ప్రవక్త ఉన్నవవారే! ఈ విషయంలో వారిని కీర్తించడానికి శ్రీ రమణారెడ్డి ఎందుకు సంశయాత్ముడయ్యారో కారణం కనిపించదు.అందుకే బంగోరె తనముందు మాటలో (పు. 48) సోపపత్తికంగా రమణారెడ్డి వాదనలను ఖండించాడు.

"తెలుగులో నాటకానికి కన్యాశుల్కం, నవలకు మాలపల్లి—ఈనాటికీ సాటిలేనివి. వాటిలో జీవితం వుంది. దాని లోతుకు వాస్తవం స్పందిస్తూంది." అన్న శ్రీ రమణారెడ్డి మాటలతో ఏకీభవించని వారెవరూ ఉండరు. ఆయన తన సహజ వైశద్యంతో ఎన్నో విషయాలను తన పీఠికలో గుదిగుచ్చారు. చర్చించారు. "కొన్ని వాక్య కదంబాలను తీసివేయడానికి ఉన్నవ వంటి ధైర్యస్థుడు సైతం ఎందువల్ల అంగీకరించాడు?" వగైరా చాలా ప్రశ్నల కదంబాన్ని ప్రయోగించారు. కాని 1923లో నిషేధపుటుత్తరువు తర్వాత జరిగిన రభసలో ఉన్నవ మాలపల్లి నుంచి ప్రభుత్వ ఆజ్ఞమేరకు తొలగించిన వాక్యాలను పరిశీలిస్తే (శ్రీ బంగోరె ఆ వాక్యాలన్నిటినీ ఉటంకించారు.) వాటివల్ల నవలా శరీరానికి లోపమేమీ కలగలేదని ఎవరైనా అంగీకరిస్తారు. సంగవిజయాన్ని సంఘ విజయంగా కీర్తిస్తూ శ్రీ సగ్గుముని కూడా ఒక ఉపోద్ఘాతం అందించారు. "ఆయన ఎన్ని శిక్షలూ బాధలూ అనుభవించారో ఈ పుస్తకం కూడా ప్రజల్లోకి రావడానికి అన్ని కష్టాలూ పడింది.... బంగోరె వంటి నిజాయితీగల పరిశోధకులు మాలపల్లి నిషేధాల ఘట్టాలు తెలుగు దేశానికి తెలియచేయ పూనుకోవడం ఎంతో ఆనందంగా ఉంది...." అంటూ గ్రంథ ప్రయోజనాన్ని కొనియాడారు.

### వ్యావహారిక భాషోద్యమం:

ప్రథమ స్వాతంత్ర్య పోరాటం ప్రారంభంకాక ముందే స్వదేశానికి తరలి వెళ్ళిన బ్రౌన్ మహాశయుడు సజీవ వ్యావహారికభాషోద్యమానికి అంకురార్పణకావిం

చినా— పండితమ్మన్యుల దుష్ప్రాపకంలోపడి తెలుగు భాష 'అఘోరించింది'. మృతప్రాయమైన ప్రజాతంత్ర విరుద్ధమైన దగుల్బాజీ గ్రాంథిక" తెలుగు ఈ దేశాన్ని పట్టి పల్లార్చింది. మద్రాసు యూనివర్సిటీ తెలుగు కాంపోజిషను కమిటీలో గ్రాంథిక వాదుల కౌరవ సభలో ఒక్క గురజాడ అప్పారావు వికర్ణునివలె పోరాడి, డిస్సెంటు పత్రం సమర్పించి బయటపడ్డాడు. ఆ విధంగా వ్యావహారిక భాషకు శాశ్వత ఘోరపరాజయం సాధించామని పండిత వృషభులు బుజాలెగరవేసు కుంటున్న దశలో- సరిగా పదేళ్ళయినా గడవకముందే ఉన్నవ మనజాతికి మాలపల్లిని సమర్పించారు ఆధు నిక స్పృహతో సజీవ వ్యావహారిక భాషకు ప్రాణ ప్రతిష్ఠ జరిపారు. ఉత్తమ మౌలిక సృజనతో జాతిని అర్చించారు. బ్రౌను మహర్షిని గురించిన పరిశోధన ధర్మమా అని శ్రీ బంగోరెవంటి చిత్తశుద్ధీ గాఢాభి మానంగల ఔత్సాహిక పరిశోధకుడికి ఎన్నెన్నో క్రొత్త విషయాలపై పరిశోధన జరగవలసే వుందని స్ఫురిం చింది. ఎన్నో కొత్త థీమ్‌లు తోచాయి, ఆ విధంగా జన్మించిన ఈ పరిశోధన గ్రంథం ద్వారా మాలపల్లిపై నిషేధాలు అనే ప్రధాన ఘట్టం మరుగునపడి పోకుండా ప్రాణం పోసుకుంది.

**ఈ గ్రంథం చాటిన సత్యాలు:**

ఈ పరిశోధనా గ్రంథం నిర్మమంగా చదివినా రెండు ప్రధానాంశాలు పాఠకులకు తేటతెల్లమవుతాయి:

ఒకటి- మన విశ్వవిద్యాలయాల తెలుగు శాఖల ఆచార్యవర్గం తక్షణం సమావేశం కావాలి. శ్రీనాథుని వీరశృంగారం గురించో, లేదా మరొకడి వీరశివార్చనా కళాశీలం గురించో, తిక్కయ్యగారి హరిహరనాథుని గురించో, సాహిత్యంలో కోతి, కుక్క, పామువంటి అత్యధిక ప్రాముఖ్యత వహిస్తున్న అత్యల్ప విషయాల గురించో పరిశోధనలు జరపమని ఆదేశించి పరిశోధ నోత్సాహకుల కాలాన్ని వయస్సునీ ధ్వంసం చేస్తున్న మహా దోషానికి ఆత్మవిమర్శ చేసుకోవాలి. జాతీయ పునరుజ్జీవన దశలో జరిగిన మహత్తర కృషి కను మరుగై పోకుండా, పరిశోధకులను ప్రేరేపించి, భద్ర పరచుకోవాలి. ఉత్తమాంశాలేమిటో మన ఆచార్య వర్యుల బుద్ధి కుశలతకు తట్టకపోతే- భేషజం విడిచి బంగోరెవంటి ఆర్కైవిస్టును సంప్రదించాలి. ఇలాంటి నిస్స్వార్థ పరిశోధనా కుతూహలాన్ని ప్రోత్సహించాలి.

రెండు: మన ఆం. ప్ర. సా. అకాడెమీవంటి సం స్థలు దీర్ఘనిద్రలో అడపా దడపా కలవరించినట్లు ఏ ఆవకాయ నవలకో బహుమతులందించి, గ్రంథ చౌర్యపు బనాయింపు గాళ్ళను సత్కరించి గొప్ప సాహిత్య సేవ చేస్తున్నట్లు గర్వపడటం మానుకోవాలి. ఔదార్యాన్ని డ్రయినేజీ పాల్జేయటమూ విరమించాలి. బంగోరె పరిశోధనా ప్రణాళికలెన్నో ధనాభావంవల్ల ఆగిపోయే దుస్థితిలో ఉన్నాయి. అలాంటి ఔత్సాహిక పరిశోధకులకు ధనసహాయం అందించి, గ్రంథాలు ప్రచురించాలి. ఆంధ్రప్రభుత్వ సాంస్కృతిక వ్యవహా రాల శాఖ అనేదొకటుంది. అంతటి మహత్తర సంస్థకు బంగోరెవంటి వారు చేసే పిల్లి సమేరీలు వినిపించడం ఏనాడో తప్పిపోయింది. అధికార పాదం చుట్టూ ప్రదక్షిణలు జరిపే నేత్రావధానం ధూర్త విద్యకు ఇలాంటి 'ధర్మ' సంస్థలు బలై పోతున్నాయి. ఐనా ఈ సాహిత్య బకాసురుడు ఆకలి తీరడం లేదు. కనక ఈ సాంస్కృతిక వ్యవహారాల శాఖామంత్రి తక్షణం మేలుకోవాలి!

ముగిస్తూ ఒక్కమాట; ఉన్నవ వారు మహాద్రష్ట. ఆయన ఈ జాతి చిరస్వప్నాల ఫలశ్రుతిగా అందిం చిన మాలపల్లి నవలపై ఆంగ్ల ప్రభువులూ వారి జోహుకుందారులూ పైశాచిక చర్యలు తీసుకున్నారు. ఆ మహత్తర చారిత్రక సంఘటన చీకటి కోణాలలోపడి కనుమరుగైపోయింది. దానిని త్రవ్వి వెలికితీసి ప్రజల దృష్టికి తెచ్చి ఉత్తమ పరిశోధన గ్రంథ మందించాడు శ్రీ బంగోరె. సత్యవాదుల అందరి పక్షాన బంగోరెకి ధన్యవాదాలందిస్తాను. నగ్నముని చెప్పినట్లు—''జీవి తంలోనూ సాహిత్యంలోనూ ఉన్నత ప్రమాణాలు నెలకొల్పిన ఉన్నవ వారిని ఆంధ్రదేశం తిరిగి తిరిగి తల్చుకోవాల"ని కోరుతాను అందుకై ప్రతి ఒక్కరూ ఈ గ్రంథాన్ని కొని, అధ్యయనం చేయడం కనీస ధర్మమని మనవి చేస్తున్నాను.

**కాలాకేలి నికేతన్ పిఠాపురం-533450**

భారత భారతి

# ప్రేమ్‌చంద్ తరువాత

-శ్రీ శ్యామ్‌లాల్

కాలగమనంతో ప్రేమ్‌చంద్ ఇలవేల్పుగా మారి నట్లున్నాడు. లేకపోతే ఆయన శతవార్షిక జయంతి సందర్భంగా ఇంతమంది పెద్దలూ ప్రముఖులూ ఆయనకు నివాళు లెందుకు అర్పిస్తారు? ప్రేమ్‌చంద్ ఇప్పుడు ఎవరినీ బాధించడు; ఎవరికీ దిగ్భ్రాంతి కలిగించడు. కాబట్టేనేమో సిద్ధాంతాలరీత్యా రైటిస్టులు, లెఫ్టిస్టులు అనబడేవారు అహమహమికతో ప్రేమ్‌చంద్ మావాడంటే మావాడని బాహాటంగా చెప్పుకొంటున్నారు. తన కాలం నాటి దుస్సహము, బాధాకరము, నిరాశా జనకము ఆయన నిత్యజీవిత యథార్థాలకు దర్పణములుగా నిలిచే హిందీ నవలలను, కథానికలను రచించడంలో మార్గదర్శి అయిన రచయితగా ఆయనకు సాహిత్యంలో స్థిరమైన స్థానం చేకూరింది. దాని కిక చలనం లేదు. ఇక ఉన్న సందేహమల్లా ఆయనకూ ప్రస్తుతానికీ ఏమైనా సంబంధం ఉన్నదా లేదా అన్న అంశమే.

వర్తమాన కాలంపై గత కాలపు ప్రభావం ఎంత ఉన్నదో, ప్రేమ్‌చంద్‌కు ఊపిరి సలుపనివ్వకుండా చేసిన అలనాటి సమస్యలు నేటికీ ఎంత జటిలంగా ఉపద్రవకరంగా ఉన్నాయో గమనిస్తే పై సందేహం విడ్డూరంగా కనిపిస్తుంది. నేటి మన పల్లెపట్టులలో సంప్రదాయపు మృతకళేబర భారం ఇంకా అలాగే ఉంది. ప్రేమ్‌చంద్ కాలంలో మాదిరిగానే కోట్లాది జనం దారిద్ర్యంలో క్రుంగిపోతున్నారు. మారింది ఏమిటయ్యా అంటే యథార్థానికి సంబంధించిన మన ఊహాపోహలు. మన సంవేదన, ఆర్ద్రత ఆయన కాలం నాటివి కావు. కొంత భిన్నమైనవి. ఆయనకున్నంత గాఢ విశ్వాసం మనకు లేదు. కొన్ని విషయాలు ఆయన కెంత సూక్ష్మంగా, సూటిగా, నిష్కపటంగా ద్యోతకమయ్యేవో అలా మనకు కనిపించవు. తన స్థాన మేమిటో ఆయనకు బాగా తెలుసు. ఆ విషయంలో ఆయన కేమాత్రం సందేహం లేదు. కాని నేటి మన స్థితి విషయంలో మనకెంత నమ్మకముంది? మన మనస్సులలో నుంచి సందేహాలనే కీటకాలను తొలగించుకోలేని స్థితిలో మనమున్నాం!

ప్రేమ్‌చంద్ సృష్టించిన పాత్రలపట్ల మనకు జాలి కలుగుతుంది. ఆ పాత్రలు మమ్మల్ని మీరు అర్థం చేసుకోండి అని మనల్ని అర్థించవు. అవి మనలో సానుభూతిని రేకెత్తిస్తాయి-అవి మూగజీవాలు. మరీ సాత్వికులు-పరిస్థితులపై ఎదురు తిరిగి ప్రతిక్రియ జరపరు. తమకు సంభవించిన పరిస్థితులను వచ్చిన వాటిని వచ్చినట్లె స్వీకరిస్తారు. తూర్పు ఉత్తరప్రదేశ్, బీహారు ప్రాంతాలకు చెందిన హోరీలు సరిగ్గా అటువంటి దారిద్ర్యావస్థలో నేటికీ ఉండి దీనులుగా జీవితం వెళ్ళబుచ్చడం మనకు తెలిసిన విషయమే. ఘీసూలు తమ దుర్భర స్థితులను కాస్తంత సేపు మరచిపోపడానికి నేటికీ త్రాగుడుకు అలవాటుపడే ఉన్నారు. ఈ పాత్రలు నోళ్ళు విప్పి మరికొంత విశదంగా తమ గోడు చెప్పుకొంటే బాగుండునని మనకు అనిపిస్తుంది. కాని వారా పని చేయరు.

ప్రేమ్‌చంద్ పాత్రలను గూర్చి ఇంకా ఎన్నో ప్రశ్నలు అడగాలనుకుంటాం. వీళ్ళు ఎంతకూ రెచ్చి

పోరెందుకని? పరిస్థితులను అంతగా సహిస్తారేమిటి? ఆశకు ఏమాత్రం తావులేని పట్టులకూడా ప్రేమ్‌చంద్ ఇంకా ఏదో ఆశతో అదే ధోరణిలో పడిపోతాడేమిటి? ఆయనలో ఎంత ఆశాభావం! ఇంకా ఏదో మంచి జరుగుతుందనే అనుకుంటాడు. లోతుల్లోకి దిగడానికి ఆయన కెందుకు అంత జంకు? పైపైన ఉండే మన కేసి చేయెత్తి సంజ్ఞ చేస్తాడేమిటి? ఆయన రచనల్లో ఉష్ణం, ఉద్రేకం, తాపం కనపడవేం? మనిషి అంత సాధువుగా, మెత్తగా, శాంతంగా. మర్యాదగా ఎలా ఉండగలిగాడు?

ప్రేమ్‌చంద్ ఒకానొక కాలపువాడు, నేటి కాలపు మనిషి కాడు అని మనకు అనిపించడానికి కారణమేమి టంటే ఆయన లోలోపలి నీతి బోధకుడు కథకుడైన ఆయనతో కలిసి జోడుగా బండిని లాగడమే. కాబట్టె కొన్ని సమస్యల్ని మరీ సరళం చేస్తాడు. మరికొన్ని పాత్రలను ఒకే మూసలో పోసితీసిన ప్రతిమలవలె రూపొందించే ధోరణి ఆయనలో మనకు కన్పిస్తుంది. తన పాత్రలు దీనులు ఆ పన్నులు అని చెబుతూ ఆయన చేసే సంకేతాలలో ద్వంద్వం, ద్వైధీభావ లక్షణం గోచరిస్తుంది. ఆ సంకేతాలలో రండి, ఆదుకోండి అన్న పిలుపూ ఉంది, ఈ స్థితిని సంస్కరించండి అన్న విజ్ఞప్తీ ఉంది. ఈ భూమండలంపై ఉన్న నిర్భాగ్యులకు న్యాయం చేకూర్చాలని ప్రేమ్‌చంద్ ఆశయం. బహుకాలంగా బాధల్లో మునిగి తేలిన ఇల్లాలిని ఆమె కుటుంబం వారు మంచిగా చూడాలనీ, మానవులు మరికొంత దయగలవారై ప్రవర్తించాలనీ ఆయన ఆకాంక్ష. కాబట్టె స్థితిగతులను ఉన్నవి ఉన్నట్టుగా చూస్తాడు. వాస్తవాన్ని సలక్షణంగా చిత్రిస్తాడు. వాస్తవికతలోని క్లిష్టతలనూ, అసంగతాలనూ, వైరుధ్యాలనూ పట్టించుకోడు.

అందుకే ప్రేమ్‌చంద్ మన హృదయ తంత్రులను మీటుతాడు. కాని ఇందులో దయనీయమైన విశేష మేమిటంటే కథానికను నైతికారోగ్య శాస్త్రానికి సంబంధించిన పాఠ్యాంశంగా చేయవచ్చుననో, లేక నైతిక సంబంధమైన కండబలాన్ని ఇచ్చే వ్యాయామపు గదగా మార్చవచ్చుననో అన్న అభిప్రాయం ఉండడం.కథను చెప్పే రీతిలో కల్లా కపటం ఏమాత్రం ఉండవు. కథనాన్ని సరళం, సుగమం చేయడంలో ఆయన తన శక్తిసామర్థ్యాల్ని ఎరుగును. అందులో కవిత్వపు పోకడలు ఉండవు సందిగ్ధం ఉండదు. వాస్తవాన్ని పుణికి పుచ్చుకునే నేర్పు అపారంగా ఉంది. కథానికలో అన్ని రుగ్మతలనూ స్వస్థపరచే మానవకారుణ్యమనే క్షీరాన్ని సృష్టించగలిగితే చాలు.

కొత్త తరం రచయిత లెవరూ ప్రేమ్‌చంద్ నైతిక భంగిమ ప్రదర్శిస్తున్నాడన్న నింద వేస్తారని నేను అనుకోను. ఆయన నిజాయతీని ఎవరూ సందేహించరు. కాని ఆయన ఆశించే ప్రయోజనం విషయంలోనే సందేహాలు వెలిబుచ్చుతారు. ప్రశ్నలు వేస్తారు. కాలగమనంతోపాటు ఆయన తన మానవ కారుణ్యమనే క్షీరాన్ని పులుపు చేశాడు. ఏమైతేనేం. యువ రచయితలకు ఆ క్షీరంవల్ల ఉపయోగం లేదు. ఒక్క కథనంతో మాత్రమే వాస్తవికతను పట్టుకోజాలమని వీరికి తెలుసు. మరి వాస్తవికత సంక్లిష్టంగా, అనేక వైరుధ్యాలతో, చీకటి కోణాలతో కూడుకొని ఉంది. నన్ను తాకకండి, దూరంగా ఉండండి అనేటంత జటిలంగా గహనంగా ఉంది. ఒక్క క్షణాన్ని, ఇలా ఉండి అలా పోయే చిత్తవృత్తిని ఒడిసి పట్టుకోవడం, దుర్బలము క్షణభంగురము అయిన మానవ సంబంధాలనూ, తమ రహస్యాలను అరుదుగా కూడా బహిర్గతం చేయనట్టి కొన్ని విషయాలదళసరితనాన్నీ, మానవుల కుండే కోర్కెల వ్యర్థతనూ క్షణం వెలుగులోకి తెచ్చి వీటి నైజమిది అని చూపడం - ఇదే కథానిక చేయగలిగిన పని అని ఈ తరం రచయితల అభిప్రాయం.

సాంఘిక పరివర్తనాన్ని వేగిరం చేయడానికి నవలను ఒక ఆయుధంగా ఉపయోగించవచ్చునని

ఒక రచయిత భావించడం మొండి ధైర్యమని ఈ తరంవారి భావన. ఒక కథానికా రచయిత తాను కలం సైనికుడనని బయలు దేరడం వీరి కొక హాస్యాస్పదమైన విషయం. అయితే దీని భావం కొత్త వారికి మార్పు అంటే అయిష్టమని కాదు. తమ కళకు కొన్ని పరిమితులున్నాయని మాత్రమే వీరంటారు. వీరిలో కొందరు అసలు కథ చెప్పడమే నిరర్థకమైన పని అనికూడా భావిస్తారేమో! నవకథ అన్న పేరే పెద్ద అప్రయోగమని వీరిలో ఒకరు ఒక్క పెట్టులో కొట్టి పారవేశారు. నవకథ అనేది అది ఎంతమేరకు కొత్తదో ఆ మేరకు కథే కాదు; అది ఎంతమేరకు కథో ఆ మేరకు అందులో కొత్తదనమే ఉండదని అన్నారు. బహుశా ఇది మరీ తీవ్రమైన దృక్పథ మేమో. అయితే ఇట్టి విపరీత దృష్టిలేనివారు కూడా. ఇలాగె కాక, కథను ''అంధకారంలో ఆక్రోశం" అంటూ తక్కువ పరచడానికి వెనుకాడే వారు కూడా ప్రేమ్‌చంద్ పాతబడిపోయాడని భావిస్తు న్నారు.

ప్రేమ్‌చంద్ గతించిన ఈ నలభై నాలుగేళ్ళలో హిందీ కథానిక స్వరూప స్వభావాలలో వచ్చిన మార్పులను ఏకరువు పెట్టడం ఇక్కడ సాధ్యపడదు. రేణు రచించిన చాలా కథలలో చురుక్కుమనిపించే వ్యంగ్యం ఉంది. బీహారు గ్రామీణ జీవిత చిత్రణలలో ఆయన ఒక కొత్త కవితారీతిని స్ఫురింపజేస్తాడు. నిర్మల్‌వర్మ రచనల్లో మానసిక స్థితిని సున్నితంగా వ్యక్తం చేసే ధోరణి ఉంది. జీవితపు క్షణభంగు రత్వం విషయంలో ఒక కొత్త స్పృహ ఉంది. గత కాలపు విషయాలను విచారంతో స్మృతికి తెచ్చు కోవడం ఉన్నది. శ్రీకాంత్‌వర్మలో ఒక వినూత్న సంవేదన, శూన్యతను క్రొంగొత్త రీతిలో భావన చేయడం ఉన్నాయి. దూధ్‌నాథ్, గ్యాన్‌రంజన్ కథల్లో ఒక కొత్త సందిగ్ధారము, ఆత్మ విశ్లేషణరీత్యా ఒకకొత్త త్రాణ కనిపిస్తాయి. ప్రేమ్‌చంద్ అనంతరం హిందీ కథానిక ఎంతదూరం ప్రయాణించిందో సూచన ప్రాయంగా చెప్పడానికే ఇదంతా ఏకరువు పెట్టాను. అయితే హిందీలో కొత్త నవల మాత్రం నవకథ ఎటువంటి నాజూకులు పోయించో, ఎంత ఆత్మ చైతన్యం కలిగినదైందో ఆ చాయలకు కూడా పోలేకపోయింది.

అయితే ప్రేమ్‌చంద్‌కూ మనకూగల దూరం ఆయన్ను పవిత్రమైన గోమాతగా చేసి పూజించి నందువల్ల తీరిపోదు. గాంధీ యుగానికి, నేటి కాలానికీ మధ్య నా నాటికి పెరిగిపోతూఉన్న అగాధాన్ని మహాత్ముణ్ణి ఒక పంథకు చెందిన ఆరాధ్య దైవంగా భావించడంవల్ల పూడ్చలేము. పరిస్థితి ఇట్లా ఎందుకు పరిణమించిందో మనం అర్థం చేసుకోవాలి. 1930 ప్రాంతాలలో మనం స్వచ్ఛతతో పెంచుకొన్న ఆశలు ఎందుకు వమ్ము అయిపోయాయి? స్వాతంత్ర్యం వచ్చిన తొలిరోజుల్లో మనం నిర్దేశించుకున్న లక్ష్యాలు అందుబాటులోకి రాకుండా ఎందుకు పోతున్నాయి? మాయ మాటలు, వంచన, దగా, మోసం ఎందుకు వ్యాప్తమయ్యాయి? మనలో బుద్ధి కుశలత, మేధ కలవారు సైతం ఎందుకు నిరాశోపహతులవుతున్నారు? ఇదంతా మనకు అవగాహన అయితే హిందీ సాహిత్య చరిత్రలో ప్రేమ్‌చంద్‌కు సముచితమైన స్థానమేదో నిర్ణయించగలుగుతాము. మనదేశ రాజకీయ రంగంలో వచ్చిన మార్పుల స్వభావాన్ని సరిగా అర్థం చేసు కుంటేనే మనజాతి రాజకీయ చరిత్రలో గాంధీ నెహ్రూ లకు గల స్థానాలను అంచనా కట్టగలుగుతాము.

మన రాజకీయాలలోవలెనే మన సాహిత్యంలో కూడా వచ్చిన చిక్కేమిటంటే, మన సమస్యలు చాలా వరకు మనం తెచ్చిపెట్టుకొన్నవే అయినప్పటికీ, మన అనుభవాలపై మన గతకాలపు బరువు సళువులు న్నప్పటికీ, మన రాజకీయ ఆర్థిక ఆదర్శాలకూ మన అనుభవాలకూ టీకా తాత్పర్యాలు చెప్పుకొని, వాటిని మన సాహిత్యంలోకి దించే తీరు విజాతీయమైనది.

అది మన సంప్రదాయానుసారమైనది కాదు. కాబట్టి ఒక నమూనాకూ, దాని ప్రతికృతికీ మధ్యపడే నీడ ఒక్కొక్కప్పుడు అనుభవానికీ దాని ప్రతిలేఖనానికీ మధ్య వెక్కిరింపు కవిత్వంగా తయారవుతుంది. అందుచేత రాజకీయ చర్చలలో మిల్, జెన్నింగ్స్ ఆర్థికాంశాల వాదవివాదాలలో మిర్డల్, లాంజె, సమకాలిక భారతీయ సాహిత్యం విషయంలో కాఫ్కా, కామ్యూస్, రిల్కీ మున్నగువారు, ఇంకా ఎందరో ఆధునికుల ప్రతిధ్వనులు అస్పష్టంగా వినపడతాయి. అయితే ఇది గర్హించి తిరస్కరించ వలసిన విషయ మేమీ కాదు. విదేశీయ ప్రభావాన్ని పూర్తిగా నిర్మూలించే విధంగా మన రాజకీయాలను గాని, సాహిత్యాన్ని గాని ధారపోయం చేసుకోలేము. అట్లని పూర్తిగా మన సంప్రదాయం పైననే ఆధారపడి ఉండనూ లేము. నిజానికి నేడు మనం ఎదుర్కొంటు న్నటువంటి సమస్యలకు మన సంప్రదాయం పరిష్కారం చూపజాలదు. మనం ఎట్టి పరిమితులకు లోబడి జీవిస్తున్నామో వాటిని గూర్చిన ఒక అంచనాను మన సంప్రదాయం మనకు స్థూలంగా తెలియజేయగలుగుతుంది. ఈ పరిమితులను అధిగమించాలంటే వాటి స్వభావ మేమిటో మనకు విశదంగా తెలియాలి. లేకపోతే మనం అనుకోని విధంగా అవి తమ స్థానాన్ని పదిలం చేసుకొని అంవికానివిగా అట్టే ఉండిపోతాయి.

1930 ప్రాంతాలలో వారి వారి ఉత్తమ రచనలు చేసిన వారికీ, ఈనాడు వ్రాస్తున్న వారికీ మధ్యగల వైరుధ్యపు స్వభావమేమిటి? దానిని మన సంప్రదాయానికీ ఆధునికతకూ మధ్య జరిగే సంఘర్షణగా ఎంచితే పొరపాటుపడ్డవార మవుతాము. ప్రేమ్‌చంద్ కూడా ఆధునికుడే. కాకపోతే భేషజాలు ఆర్భాటాలు లేని ఆధునికుడు. అయితే ఆయన ఆధునికత యాభై యేళ్ళ క్రిందటిది. ఆ రోజుల్లో జాతీయతా భావం ఒక మహానది పరదవలె పొంగి పొరలింది. ఆశలు ఉవ్వెత్తున పెద్దగా ఉండేవి. ప్రతీపశక్తుల కంచుకోటలను బ్రద్దలు చేయడానికి కవితలను, నవలలను పలుగులుగా ఉపయోగించ వచ్చునని అభ్యుదయ వాదులు భావించేవారు.

ఏమైనప్పటికీ నవలను కనిపెట్టింది ప్రేమ్‌చంద్ కాదు. నూలు వడికే యంత్రం, ఆవిరి ఇంజను కనిపెట్టిన బూర్జువా సంస్కృతియే నవలను కూడా వాడుకలోకి తెచ్చింది. నవల అచ్చమైన బూర్జువా సంస్కృతి ఉత్పాదన చేసిన వస్తువు. జాతీయతా భావం ప్రజ్వరిల్లిన ఆ సంరంభంలో ప్రేమ్‌చంద్ నవలను సంస్కరణ నిమిత్తం ఉపయోగించాడంటే అది ఆయన తప్పిదం కాదు. ఆయన సర్వోత్తమ రచనమైన 'గోదాన్' నవలలో వెన్నెముకలేని సన్నకారు రైతును నాయకుడుగా స్వీకరించాడంటే అది ఆయన కల్పనాశక్తిలో గల లోపమని అనలేము. ఆ రైతు కడగండ్లు అనుభవించడానికే పుట్టాడా అని పిస్తుంది. దౌర్భాగ్యం ఉట్టిపడే పేదరికం కాదు అతని బాధ. ముఖంలేని మనిషి అతను. బాల్జాక్ ఫ్లోబేర్ మున్నగువారి నవలల్లో జటిలమైన సమస్యలవలె సాక్షాత్కరించే వ్యక్తులున్నారు. ఆ వ్యక్తులు, ఆనవలలకు ఎటువంటి వడి, వాడి, ఉత్సాహం ఆపాదిస్తారని! ప్రేమ్‌చంద్ గ్రామీణ సమాజాన్ని గూర్చి వ్రాశాడు. ఆ సమాజంలోని ప్రతివ్యక్తి తనచుట్టూఉన్న పరిస్థితులచే సృజింపబడ్డ జీవి కాబట్టె ప్రేమ్‌చంద్ నవలల్లో సమస్యాత్మక వ్యక్తులకు స్థానం లేకపోయింది.

గొప్ప నవలలుగా నిలిచిపోయేందుకు ఏకైక ఆవశ్యకతయైన ఉద్రిక్తత ప్రేమ్‌చంద్ నవలల్లో తగురీతిగా లేకపోవడం ఆశ్చర్యపడవలసిన విషయమా? తాను సృష్టించిన కొన్ని పాత్రలవలెనే ప్రేమ్‌చంద్ కూడా తన కాలపు పరిస్థితులలో చిక్కుకు పోయిన ప్రాణి. ఆ కాలపు సమస్యలను ఆయన పాఠకునికి దగ్గరగా తెచ్చి ప్రముఖంగా ప్రదర్శించాడు. కాని సమస్యలుగా తయారైన వ్యక్తు

లను చూపడు. బాధితులను బొమ్మలుగా గీసి ఎంతో నేర్పుతో మనముందుంచుతాడు. కాని ఆంతరిక సంక్షోభాన్ని చాలా అరుదుగా చిత్రిస్తాడు. మన సాహిత్యంలో ఇటీవల సమస్యలైన వ్యక్తులు మనకు దర్శనమిస్తున్నారు. అయితే నేడు కూడా అట్టి వ్యక్తులు సకృత్తుగానే మనకు తటస్థపడతారు. వారిని చూచి ఏదో ఆశపడతాము, పాఠకులుగా. కాని సంతృప్తి కలుగదు. ఏదో ఆశాభంగము. మన యువరచయితలలో నవీనులైనవారు కొందరు సమస్యాత్మక వ్యక్తుల చిత్రణ దశను దాటవేయకుండా, వారి పూర్వీకులు పందొమ్మిదవ శతాబ్దికి చెందిన యూరపు ఖండపు మహోత్కృష్ట కావ్యాలను తుక్కు నకళ్ళు చేసినట్టి నవీన రచనలకు పేరడీలు వ్రాస్తారేమో ఎవరికెరుక?

ప్రేమ్‌చంద్ బాగా పాతబడిపోయి ఉండవచ్చుగాక. కాని నవలల కథల్లో [illegible]సవికతను ప్రతిబింబింపజేసే కళ మాత్రం పాతబడిపోలేదు. నిజం చెప్పాలంటే ప్రేమ్‌చంద్ కాలం కన్నా ఇప్పుడు ఈ సమస్య గడ్డుగా పరిణమించింది. ఎందువల్లనంటే ఈనాడు వాస్తవికత అనేదే పెద్ద గందరగోళంగా తయారైంది. కొందరు హిందీ యువరచయితలు ప్రేమ్‌చంద్ కన్నా అధికంగా భాష లోతుల్లోకిపోయి భావం, అనుభూతి మున్నగువాటి సూక్ష్మాలను కుశాగ్ర బుద్ధితో అవగాహన చేసుకోగలుగుతున్నారు. కాని వీరంతా కొన్ని పేజీల తరువాత ఊపిరి సలుపక ఉక్కిరి బిక్కిరవుతున్నారు. వీరిలో ఎవరైనా ఒక మహా రచనకు ఆవశ్యకమైన అవిశ్రాంత కల్పనా[illegible] చూపగలరా అనేది కాలమే తేల్చాలి.

('టైమ్స్ ఆఫ్ ఇండియా' సౌజన్యంతో)

అనువాదం : డి. రామలింగం

ఇ నెం 1-8-726/30, నల్లకుంట, హైదరాబాదు-44

భారత భారతి :

# తిరుక్కుర‌ళ్

చల్లా రాధాకృష్ణశర్మ

తమిళ సాహిత్యాకాశంలో ధ్రువతారగా ప్రతిభాసిస్తున్న నీతి గ్రంథం తిరుక్కురళ్. సార్వజనీనమూ సార్వకాలికమూ అయిన యీ రచన తమిళ వేదంగా ప్రసిద్ధి కెక్కడంలో ఆశ్చర్యం లేదు. ఇది క్రీస్తుకు పూర్వమే వెలుగులోకి వచ్చినట్లు పండితుల విశ్వాసం. ఈ గ్రంథ ప్రాశస్త్యాన్ని పలువురు పండితులూ కవులూ నాడూ, నేడూ వివరించారు. ఒక ప్రాచీన తమిళ కవయిత్రి, ఇలా అన్నది: 'అణువును తొలిచి అందులోకి సప్త సముద్రాలూ చొప్పించి, తర్వాత అణువుని చీల్చి అందులోంచి ఒక భాగాన్ని కురళుగా తీర్చి దిద్దాడు తిరువళ్లువర్.' తిరుక్కురళును సంతరించిన ప్రతిభాగరీయస్థుడే తిరువళ్లువర్.

రెండు పాదాల చిన్న పద్యానికి కురళు అని పేరు. తిరు శబ్దం పవిత్రతను సూచిస్తుంది. కనుక తిరుక్కురళు అనగా పవిత్రమైన గ్రంథం అని అర్థం. పదమూడు వందల ముప్ఫయి పద్యాలు అందాలు దిద్దుకున్న యీ ప్రశస్త నీతి గ్రంథానికి ముప్పా నూల్ (త్రివర్గము), తమిళ్ మరై (తమిళవేదము), ఉత్తర వేదం మొదలైన పది పేర్లు ఉన్నాయి. అలాగే తత్కర్త అయిన తిరువళ్ళువరుకి దెయ్‌వప్పులవర్ (దైవకవి), నాన్ ముగనార్ (చతుర్ముఖుడు) మొదలైన పదిపేర్లు ఏర్పడ్డాయి. ధర్మార్థ కామములను గురించి మాత్రమే ఆయన చెప్పడం వల్ల, ఈ గ్రంథాన్ని త్రివర్గం అని వ్యవహరించడం సహేతుకమూ సముచితమూను.

తండ్రీ కొడుకులూ, భార్యాభర్తలూ, పాలకులు పాలితులూ, ప్రేయసీ ప్రియులూ ఇలా ఒకటేమిటి— ఎన్నో విషయాలను గురించి తిరుక్కురళ్ తెలియజేస్తుంది. ధర్మఖండంలో ప్రవృత్తి నివృత్తి మార్గాలు విశదీకరించబడ్డాయి. రాజ్యాంగ విధానం, కోశపద్ధతి మొదలైన వాటిని వివరిస్తుంది అర్థఖండం. చివ్వరిదైన కామఖండం నుంచి తిరువళ్ళువర్ కవితా శక్తినీ కల్పనా చాతురినీ మనం గ్రహించవచ్చు. తాత్త్వికుడూ ఋషితుల్యుడూ అయిన కవి కామం గురించి తన నీతి గ్రంథంలో వివరించడమేమిటి? అని కొందరికి ఆశ్చర్యం కలగవచ్చు. ఆయన వివరించింది ధర్మబద్ధమయిన కామం. ప్రేయసీ ప్రియులకు కలిగే మధుర భావాలూ, వియోగానంతరం వారిని బాధకు గురిచేసే భావాలూ మొదలైనవి ఎంతో స్వాభావికంగా చిత్రించబడ్డాయి. అందువల్ల ఆయన చెప్పినవి సరసోక్తులుగా, సుధారసోక్తులుగా అందాలు దిద్దుకున్నాయి. ఇంతకూ తిరువళ్ళువర్ ప్రేమను ఎలా సంగ్రహంగా, సహజ సుందరంగా చిత్రించాడో చూడండి:

'పూని ద్రాక్షాసవం బానగా తీపి
కాని ప్రేమరసమ్ము కనినంత తీపి'.

అయితే పైకి కనిపించినంత సులభంగా ప్రేమ అందరికీ అలవడదు. అది సుమకోమలము. ఆ మృదుత్వాన్ని అవగాహన చేసుకుని, దాన్ని సుకుమారంగా పోషించేవారు కొద్దిమంది మాత్రమే అని తిరువళ్ళువర్ అభిప్రాయం.

'సదమల ప్రేమ పుష్పముకంటె మృదుల,
మది గ్రహించి భరించు ముదితాత్ములరిది—'

గంభీర హృదయుడైన తిరువళ్ళువర్ పిల్లల తొక్కు-పలుకులకే కాదు, వారి చిట్టి చేతులను చూసి కూడా మురిసిపోయే ఇలా పేర్కొన్నాడు.

'చిట్టి చేతుల తోడ చిటిపాప కలుపు
పట్టి దన్నమె సుధాప్రాయమై తనుపు'.

పురాకృత కర్మల ననుసరించి సంతానం కలుగు తుందని ఆయన విశ్వాసం. జన్మదాత అయిన తండ్రికి కొడుకు వల్ల మంచి పేరు కలుగుతుంది. అయితే యెప్పుడు? ఆహా! ఇటువంటి కుమార రత్నాన్ని పొందడానికి ఆ తండ్రి ఎలాంటి నోములు నోచాడో కదా-అని ఊరివారు మెచ్చుకున్నప్పుడు. అదే తనయుడు తండ్రికి చేసే ఉపకృతి?

'తనయుడు జనకుని కొనరించు మే 'లి
తని పొంద ఏమి నోచెనొ తండ్రి' యనుట.'

వళ్ళువర్ దృష్టిలో గృహస్థ జీవితం సర్వోత్కృష్ట మయింది. విద్యుక్త ధర్మ నిర్వహణం, అతిథి సత్కా-రం మొదలైనవి గృహస్థుని జీవిత సౌఖ్యానికి మూల కారణాలు. మానవ సమాజంలో గృహస్థుకి గల స్థానం విలక్షణ మయింది. బ్రహ్మచారులకూ, వానప్రస్థులకూ, సన్న్యాసులకూ, దరిద్రులకూ నిస్సహాయులైన మృత శరీరములకూ అతను మిత్రుడు. దిక్కులేక మరణించే వారికి పారలౌకిక క్రియలు చేయడం వల్ల గృహస్థు వారికి సైతం మిత్రుడవు తున్నాడు. ధర్మానికి నామాంతరం గృహస్థజీవితం అనవచ్చు. వళ్ళువర్ పేర్కొన్నాడు గదా, తన విధ్యుక్త ధర్మాలను సక్రమంగా నిర్వహించే గృహస్థుని సంఘం దేవుడని భావిస్తుంది. అనగా, విధ్యుక్త ధర్మనిర్వహణ గృహస్థుని దైవస్వరూపునిగా చేస్తుందన్నమాట!

ప్రతి మానవుడూ దయార్ద్రచిత్తుడై ప్రేమను ప్రదర్శించాలని తిరువళ్ళువర్ ఆదేశించాడు. ఆయన మానవతాదృష్టికి ఈ భావం పునాది వంటిది. ప్రేమ రహితులు తమకు మాత్రమే ఉపయోగపడతారనీ, ప్రేమ గలవారు సంఘానికి ఉపయోగపడతారని ఆయన పేర్కొన్నాడు. ప్రేమ రహితుల్లో స్వార్థ దృష్టి వుంటుంది. ప్రేమగలవారు విశాల భావ సమన్వితులై వుంటారు. వారికి స్వార్థ దృష్టికి చుక్కెదురు! వారిలో త్యాగ దృక్పథం నెలకొని వుంటుంది. కనుకనే వారు సమాజానికి సహాయ పడతారు. ఆయన ఇంకా అన్నాడు గదా! ప్రేమ వల్లనే జీవితానికి సార్థకత అంటూ యేర్పడుతుంది; ప్రేమ రహితులు తోలు కప్పిన ఎముకల గూళ్ళు-కాగా, ప్రేమ తత్త్వం అతి విశిష్టమయింది. ఆ రాత్రి ఏక కవీశ్వరుని మాటల్లో చెప్పాలంటే:

"ఎల్ల అంగము లుండి యేమి లాభమ్ము
ఉల్లము ప్రేమకు ఉనికి కానపుడు?"

దయాభరితమైన యీ ప్రేమ మానవుడికి సహ జంగా కలగాలి కాని తెచ్చిపెట్టుకున్నదిగా వుండ కూడదు. అంతేకాక ప్రత్యుపకారాన్ని ఆశించే ప్రేమగా వుండకూడదు. అలాంటిదే నిజమైన ప్రేమ; ఆ ప్రేమనే వళ్ళువర్ పదే పదే ప్రశంసించాడు. ఒక పద్యంలో ఆయన అన్నాడుగదా! స్వర్గం లభించినా, పుచ్చుకోవడం మంచిది కాదు. స్వర్గం లభించకున్నా యివ్వడమే మేలు-అని. దయాభరిత హృదయుడై ఒకరికి యివ్వాలి కానీ. ప్రత్యుపకారాన్ని యే మాత్రమూ ఆశించకూడదు, ఆ యివ్వడాన్ని కూడా ప్రేమతో ఇవ్వాలి. ఈ సందర్భంలో వళ్లువరే చెప్పిన యీ కమనీయ సూక్తిని గుర్తు చేసుకోవాలి:

'కసరి యిచ్చిన దానికంటె-రమ్యోక్తి
పసమించు మోముతో పలుకుటే రక్తి'.

ప్రేమ కలిగి వుండడమేకాక ప్రేమతో మాట్లాడా లని కూడా వళ్లువరే ఆశించాడు. కఠినోక్తులు అవాంఛ నీయము లన్నాడు.

"లలితోక్తులుండ దుర్లలితోక్తులాడ
ఫలము వద్దని కాయ వలచుట చూడ."

మంచి మంచి మాటలు ఎన్నో ఉండగా, వాటిని త్రోసి రాజని, కటూక్తులు వాడడం పండు వద్దని కాయకోసం అర్రులు చాచడం వంటిదే —అని ఆ మహా కవి వెలిబుచ్చిన అభిప్రాయం సరసమూ సహృదయ రంజకమూ. ఎందుకంటే, లలితోక్తులవల్ల సత్ఫలితాలు లభిస్తాయనీ, ఆ ఫలితాలు చూచిన తర్వాతనైనా మానవుడు కఠినోక్తులాడడం మానుకుంటాడనీ వళ్లువరే ఒక పద్యంలో పేర్కొన్నాడు.

సరసోక్తి ఎంత శ్రేయోదాయకమో, మందహాసం కూడా అంత అవసరమని వళ్లువర్ అభిప్రాయం. నవ్వడం తెలియని వ్యక్తికి ఈ విశాల విశ్వం పట్ట పగలే అంధకార బంధురంగా కనిపిస్తుంది అని ఆయన స్పష్టం చేశాడు. కనుక ప్రతి వ్యక్తి నవ్వడం నేర్చుకుని, కష్టాలను ఆ నవ్వులో విస్మరించాలన్నది ఆయన అభిమతం. కష్టాలు కమ్ముకున్నప్పుడు నవ్వుతూ వుండాలి అని వళ్లువర్ ఆదేశించాడు.

తాత్త్వికుడే అయినప్పటికీ, వళ్ళువర్ ఎన్నడూ కూడా వాస్తవ దృష్టిని మరిపోలేదు. కనుకనే యీ లోకంలోని సుఖదుఃఖాలను కష్ట నష్టాలను ఆయన విస్మరించలేక పోయాడు. తట్టుముట్టాడే పేదరికంతో సంసారయాత్ర సాగించే వారిని చాలా మందిని చూసివుంటారు. వారిని చూసి కన్నీరు కార్చాడు. పేదరికం కంటె బాధకరమయింది ఏది? అని ప్రశ్నించుకుని, ఆయనే అందుకు బదులు చెప్పాడు, ఒక పద్యంలో. పేదరికం కంటె బాధాకరమయింది పేదరికమే అన్నాడు తిరువళ్ళువర్.

ధర్మ ఖండంలో సాంసారిక జీవనమూ సన్న్యాసాశ్రమమూ వివరించబడినట్లుగా, అర్థఖండంలో పాలకులకూ పాలితులకూ మధ్య ఉండవలసిన సంబంధం వివరించబడింది. విజ్ఞాన సముపార్జనలో పాలకుడు అప్రమత్తుడై ఉండాలి. అధర్మపరుడైన పాలకుడు క్రమక్రమంగా తన రాజ్యలక్ష్మిని కోల్పోతాడు. అతని సిరిసంపదలు నశించడానికి ముఖ్య కారణం కష్ట చరితుల కన్నీరే. న్యాయ పరిపాలన కీర్తికి మూల స్తంభం. అధర్మ పరిపాలన అపయశస్సుకి హేతువవుతుంది. క్రూరాత్ముడైన వాని పాలనలో దరిద్రుడి కంటె ధనికుడే దురవస్థకు పాల్పడుతున్నాడు. ఇలా తిరువళ్ళు వర్ పేర్కొన్నాడు.

తిరువళ్ళువర్ దృక్పథంలో వ్యవసాయం అతి ప్రధానమయింది. అన్ని వృత్తులకూ అది తలమానికం. ఈ లోకానికి ఆహార మిస్తున్న మహనీయుడు కర్షకుడు. భూమిని దున్ని జీవించే వారే జీవిస్తున్నట్టు భావించాలి. మిగిలిన వృత్తులవారు వారి మీద ఆధారపడి జీవిస్తున్నారు. ఈ కురళ్ చూడండి.

"చేను దున్నెడు వారె జీవించువారు
కాని, లెక్కారు వారి గడన కానిత్రు."

అలాంటి కర్షకులు కనుక చేతులు ముడుచుకొని కూర్చుంటే, సకల వాంఛలకు స్వస్తి చెప్పి సాంద్రాటవీ సీమల్లో కాలక్షేపం చేసే సన్న్యాసులు సైతం దురవస్థలకు గురి అవుతారు. కర్షకుడు ఎప్పుడూ పొలం పనుల్లో నిమగ్నుడై వుండాలి. ఎందుకంటే, పొలము అలిగే పడతి వంటిది. ఆమెను ఎప్పుడూ సంతోష పరుస్తూ వుండాలి. అనగా, కర్షకుడు సదా పొలం పనులు చేస్తూ వుండాలి. అలా కృషి చెయ్యకుండా తన పేదరికాన్ని గుర్తుకు తెచ్చుకుని కంట తడి పెట్టే కర్షకుణ్ణి చూసి భూలక్ష్మి కహ కహ నవ్వుతుంది. వళ్ళువర్ మాటల్లో చెప్పాలంటే:

"ఏ విధి బ్రతుకని యేడ్చు కర్షకుని
భావించి నవ్వు భూదేవి పక్కుమని."

తిరువళ్లువర్ వివరించిన ప్రధాన భావాలలో ఒకటి అహింసాతత్త్వ ప్రాధాన్యం.

సర్వభూతముల యందు గౌరవాభిమానాలు యేర్పడడానికి అహింసా తత్త్వం ఎంతైనా దోహదం

చేస్తుంది. అహింసను ఒక ధర్మంగా అవలంబించాలి. హింస పాపానికి దారితీస్తే, అహింస సుఖశాంతులకు కారణభూత మవుతుంది. ఈ వివిధ విషయాలను మనస్సులో వుంచుకొని కాబోలు, హింస చేయకుండా వుండడం పరమధర్మమనీ, సకల దోషాలకు హింస కారణమనీ వళ్ళువర్ యిలా తెలియ జేశాడు:

''హింస సలుపమి అహీన ధర్మమ్ము
హింస కారణ మన్ని దోసములకును.''

తిరువళ్ళువర్ ధర్మజ్ఞులను బహుధా ప్రశంసించాడు. అయన వారిని శాన్రోర్ అని వ్యవహరించాడు. ధర్మజ్ఞులకు విధిగా జ్ఞానం, సార్వజనీన ప్రేమ, అందరికీ సహాయపడాలనే ఆశ, అనుకంప, సత్య భాషణం- వుండాలని ఆయన అభిప్రాయం. ఈ విశిష్ట గుణాలు వున్నవారే ధర్మజ్ఞు లవుతారు. వారు ప్రేమమూర్తులు. అపకృతి చేసిన వారికి సైతం వారు ఉపకారంచేస్తారు. ఈ విశిష్ట గుణం కనక లోపిస్తే, ధర్మజ్ఞులకు కళంకం ఏర్పడినట్లే. ప్రళయ కాలంలో కూడా వారు తమ ధర్మాలను విసర్జించరు. పైగా చలించరు కూడా. అటువంటి మహనీయుల వల్లనే యీ లోకం నిలువ గలుగుతోంది. ధర్మజ్ఞులలో అహంకారం మచ్చుకైనా కనిపించదు. తన, మన అనే భావానికి అతీతులుగా ఉంటారు వారు. తమ కంటె తక్కువవారి చేతిలో ఓటమి సంభవించినా, ఆ విశిష్టగుణ సంపన్నులు సహర్షంగా ఆ పరాభవాన్ని స్వీకరిస్తారు. ఒక వేళ అలాంటి ధర్మజ్ఞులు తమ విశిష్టగుణాలను విసర్జిస్తే, అప్పుడు భూమి కూడా అందరినీ భరిస్తున్న తన ధర్మము నుంచి తప్పుకుంటుంది. కాగా, ప్రపంచ గతికి ధర్మజ్ఞులు ప్రధాన కారణ మవుతున్నారు.

''ధర్మ మూర్తులు గతి తప్పిరే?
ధర్మమ్ము తప్పను ధరణి సైతమ్ము''

మానవుడు ధర్మజ్ఞుడు కావడానికి ప్రయత్నించాలి. అంతకు ముందు అతను గృహస్థుగా తన విధ్యుక్త ధర్మాలను ఆచరించాలి. ఆ తర్వాత త్యాగబుద్ధి అలవరుచుకోవాలి. అయితే గృహస్థు నిర్వర్తించ వలసిన ధర్మాలేమిటి? తిరువళ్ళువర్ ఇలా పేర్కొన్నాడు:

''మనసులో చేర్చకు మలినత, ధర్మ
మనగ అదియె, పెర ఆడంబరమ్ము.''

మనస్సుని మాలిన్యరహితంగా ఉంచుకోవడమే విశిష్ట ధర్మమనీ. యితర ధర్మములన్నీ వట్టి ఆడంబరాలనీ ఆయన అభిప్రాయం.

ఇలా తమిళ వేదకర్త జ్ఞానం, నీతి, కామం మొదలైన ఎన్నో విషయాలను గురించి వివరించాడు. క్రీస్తుకు పూర్వమే తిరుక్కురళ్ సంతరించబడినా, అది నేటికీ ప్రచుర ప్రచారంలో ఉండడం, అందులోని సూక్తులు విభిన్న భాషల వారికీ విభిన్న సంస్కృతుల వారికీ శిరోధార్యములు కావడం గమనించ దగిన అంశాలు. ఈప్రశస్త నీతిగ్రంథాన్ని ఒక సహృదయుడు 'రజత పాత్రలో పొదగబడిన స్వర్ణఫలం' అని అభివర్ణించాడు. అలాగే మరో సహృదయుడు తిరువళ్ళువర్ మహాకవి? విశ్వమానవ కవిగా పేర్కొన్నాడు.

ఒక ప్రాచీన తమిళ కవి తిరువళ్ళువర్ మహాకవిని గురించి చెప్పిన భావాన్ని ఆధారంగా చేసుకుని శ్రీచల్లా లక్ష్మీనారాయణశాస్త్రిగారు చెప్పిన పద్యంతో ఈవ్యాసం ముగిస్తున్నాను.

'కొంచెపు నీటిబిందువున
గోచరమైన మహా తరుక్రియన్
సంచిత పుణ్యరాశి యన
జాలిన తావక భావజాల మ
భ్యంచిత రీతిమై ద్విపద
లందె కుదించి రచించి నట్టి నీ
యంచిత పుణ్యమూర్తికి జొ
హారు లివే-తిరువళ్ మహాకవీ!

త్రవ్విన కొలది చెలమ నేర్పడిన నీర
మట్లు, చదివిన కొలదిభావైక రాశి
నలరు భవదీయ సత్కవితామృతాప్తి
పార మేలేదు రసిక ప్రపంచమునకు.

ఒరియా కథ :

# ప్రారంభోత్సవం

మూలం :
## నందినీ సత్పథి

తెలుగు :
## మానేపల్లి సత్యనారాయణ

సమయం దగ్గిర పడుతున్నకొద్దీ పూనా మనస్సులో ఆతృత అంతకంతకూ పెరుగుతోంది. యింట్లో నాలుగు మట్టికుండలున్నాయి. వాటిలో ఉల్లిపాయలనీ, ఉప్పనీ, పప్పనీ ఏవేవో వున్నాయి. గోడని రెండు కొయ్యల మీద బల్లచెక్క వుంది. పూనా వున్న నాలుగు వస్తువుల్నీ ఆ బల్ల మీద చక్కగా పేర్చి ఓసారి చూసుకుంది. సరిగ్గా ఉన్నదీ లేనిదీ. ఎందుకో సంతృప్తిగా లేవు. మళ్ళీ మార్చి సర్దింది.

ఇవ్వాళ చాలా పెందలాడే లేచి యిల్లంతా శుభ్రం చేసింది. నేల మీద ముగ్గులు పెట్టింది. సోనియా తనకు మిగిల్చి వెళ్ళింది ఈ ఒక్క గదే.

సోనియా అనేసరికి ఎన్నెన్నో జ్ఞాపకాలు మనసులో ముసురుకున్నాయి. నాలుగేళ్ళ వైవాహిక జీవితం ఒక కలలా యిట్టే గడిచి పోయింది. ఎన్నో తీరని కోరికలు, ఎన్నెన్నో కష్టాలు, ఒక్కో పూట తిండి కూడా ఉండేది కాదు. అయినా సోనియా పెదవులపై ఆ నవ్వు అలాగే వుంటుంది. సోనియా ఒక కూలీ. రోజుకి ఎనిమిదణాల కూలి తనకి. ఆ కాయకష్టానికి- విశ్రాంతి లేని అలసటకి- సోనియా వంటి ఆరోగ్యవంతుడు సైతం మంచం పట్టాడు. అతను ఘోరమైన జబ్బుతో బాధపడే వాడు. ఓకోసారి రక్తం కక్కేవాడు. మూడు నెలల్లో చచ్చి పోయాడు. సరయిన తిండిలేదు. జబ్బుకి తగిన మందు లసలే లేవు.

పూనా పొదుపుచేసి సొమ్ము కూడబెట్టింది, యిప్పుడు కాస్త సంపాయిస్తోంది. రోజూ రెండు రూపాయలు కళ్ళజూస్తోంది ఈ పాటికి కొద్ది డబ్బులు కూడ బెట్టింది. మొన్నొక రోజు ఒక గ్రామసేవిక వచ్చి చాలా చాలా చెప్పింది. దాంతో పూనా తన పేర పోస్టాఫీసులో సేవింగ్సు ఎకౌంట్ ప్రారంభించింది. పూనా ఒక్కతే పోస్టాఫీసుకు వెళ్ళి ప్రతినెలా ఆ ఎకౌంట్‌లో సొమ్ము వేస్తుంది. సోనియా బ్రతికి వుంటే ఆ సొమ్ముతో హాయిగా ఇద్దరికీ కాలక్షేపం జరిగిపోను. ఇప్పుడు పూనాకు ఉచిత వైద్యసదుపాయాలు, ఉచితంగా మందులు కూడా లభిస్తున్నాయి.

మొన్న సుశీల పెనిమిటి రాముని- పెద్ద ఆస్పత్రికి కూడా పంపారు కంపెనీవారు. అతనికి కంపెనీవారు మందులకీ, మంచి ఆహారం తీసుకోవడానికీ తగిన డబ్బు యిస్తారు. రాము జబ్బునయమై యింటికొస్తాడని ఎవ్వరూ అనుకోలేదు. కాని, నాలుగు నెలలుతిరిగేసరికి ఆరోగ్యంగా తిరిగి వచ్చాడు- పనిలో కూడా చేరాడు. అదంతా తలుచుకుని పూనా గట్టిగా నిట్టూర్చింది.

"మీరు కొన్ని చిత్రాలు కూడా పెట్టారా యింట్లో?" అన్నాడొకాయన. పూనా గతుక్కుమన్నది ఆ మాటలకి. పూనా వెనక నుంచున్న కొందరు పెద్ద మనుషులు ఆ బొమ్మలు చూస్తున్నారు యింత సేపూను.

## 2

పూనా కొంచెం బుర్ర ఉపయోగించి ఆలోచించి ఒక పెద్ద డామ్(dam) బొమ్మ వేసింది. నదిపై డామ్ (ఆనకట్ట) అక్కడ ఒక పెద్ద జలాశయం, ఎలక్ట్రిసిటీ

సరఫరా.... ఏన్నో గ్రామాలకూ పట్టణాలకూ వెలుగు వెల్లువ. ఈ చిన్న గ్రామంలో ఏన్నెన్నో పరిశ్రమలు, కర్మాగారాలు, పాఠశాలలు, ఆస్పత్రులు. పిల్లలూ యూనీ ఫారాలతో లైనుగా నిలబడి బడికి వెళతారు. పూనా మనసులో ఉన్న రంగులన్నీ చిత్రంలో ప్రతిబింబించాయి.

ఆ పెయింటింగ్ వేపు పెద్ద మనుషులంతా చిత్రంగానూ, ఆశ్చర్యంగానూ చూస్తున్నారు. పూనా కూడా ఆ చిత్రం వేపే చూస్తోంది. పూనాలో ఎంత ఆలోచన. నిజంగా తన సృష్టికి తానే ఆశ్చర్యపోతోంది.

ఒకాయన అడిగాడు— "ఆ బొమ్మలో యింటి ముందు ఒక తోట వెయ్యలేక పోయారా?"

పూనా సిగ్గుపడుతూ సమాధానం చెప్పింది. "నిజమే. కాని జాగా ఏదీ? పెద్ద పార్కువే శానుకదూ. చూశారా? అందులో పిల్లలంతా హాయిగా ఆడుకోవచ్చు."

టౌన్ మధ్యలో పార్కు వేసింది. ఆ పార్కులో ఉయ్యాల, జారుడు బల్ల, ఇలా ఎన్నెన్నో. ప్రతి మలుపులోనూ ఎలెక్ట్రిక్ దీప స్తంభాలు.

ఒకాయన అన్నాడు-"యీ చిత్రంలో టౌన్ తాలూకా ప్లాన్ అంతా చాలా బ్రహ్మాండంగా వుంది."

సంతోష్ బాబు-అతనొక కార్మిక నాయకుడు— అందుకున్నాడు. "నిజమే. తప్పకుండానూ. ఈ షల్లెటూరి జనంలో ఎందరు గొప్ప గొప్ప ఇంజినీర్లు దాగి వున్నారో!" అన్నాడు.

పూనాకి ఇదంతా ఏమీ బోధపడలేదు. అందరూ తన యింట్లో అంత సేపు ఉండటంవల్ల ఎంతో సంతోషించింది. వాళ్ళని కూచో బెట్టడానికి యింట్లో చాప తప్ప యింకేమీలేదు. పూనా పడుతున్న యిబ్బంది గ్రహించాడు సంతోష్‌బాబు.

"చూడమ్మా. నువ్వేం యిబ్బంది పడకు. నీతో ఓ ముక్క చెప్పి పోదామని వచ్చాం. చెప్పేసి వెళి పోతాం" అన్నాడు.

పెద్ద ఆఫీసర్లకి ఏం పని వుంటుంది పూనాతో? పూనా కళ్ళు ఆశ్చర్యంతో పెద్ద వయ్యాయి.

చీఫ్ యింజనీర్ అన్నాడు- "చూడమ్మా ఇక్కడున్న ప్రాజెక్టుకు ఇవ్వాళ ప్రారంభోత్సవం జరుగుతుంది. మేం ప్రధానమంత్రిని ఆహ్వానించాం,"

పూనాకి ఆశ్చర్యమూ, భయమూ కూడా వేశాయి. "ఏమిటీ? ఆయన వస్తానన్నారా రానన్నారా?" అనడిగింది. కొంపముంచి ఆయన రాకపోతే ఈ ఏర్పాట్లన్నీ వ్యర్థం అయిపోవూ?

సంతోష్‌బాబు నవ్వాడు. "అదేం లేదు. తప్పకుండా వస్తారు. అసలు ఈ ప్రాజెక్టు కోసం ఎవరయితే నిజానికి తమ చెమటోడ్చి రక్తం ధారపోశారో వాళ్ళే దీనికి ప్రారంభోత్సవం చెయ్యాలని ఆయన వుద్దేశం. నువ్వీ ప్రాజెక్టులో పని చేశావు కదూ మొదణ్ణించీనూ. నువ్వే చేద్దూగాని ప్రారంభోత్సవం."

ఏదో స్వర్గంలో తేలి పోతున్నట్టు తోచింది పూనాకి. ఇటువంటి ప్రాజెక్టులు మంత్రులు, గొప్ప గొప్ప వాళ్ళు ప్రారంభోత్సవాలు చేస్తారట. అదేమిటి యివ్వాళ ఇలా అంటున్నారూ-?

ప్రధాన మంత్రి పక్కన నిలబడింది పూనా. కోలాహలం-చప్పట్లు-బాండు మేళం తనను తను మర్చిపోయింది. జనం అంతా ఆమె వేపే పట్టి చూస్తున్నారు. ప్రజలు కేకలు వేస్తున్నారు. ప్రధాన మంత్రీ జిందాబాద్-ప్రధాన మంత్రికీ జై-అందరి నోటి నుంచీ వచ్చే ఏకైక వాక్యం ఇదే. ఎవరి మనసులోనూ మరో ఆలోచన లేదు. తాను ఏం చెయ్యాలో తనకే తెలియదు. అలా చూస్తూ వుండిపోయింది. పూనా కనుపాపల్లో ఎన్నో అందమైన ముఖాలు కన్పబడుతున్నాయి....సోనియా, మధుభాయ్, బజభోఫ్.... పూనా విజయాన్ని చూసి సంతోషిస్తున్నారు వాళ్ళు. పూనా వాళ్ళ ముందు తల వంచింది వినమ్రంగా.

# రాధ
## (సంగీత రూపకము)

—సౌంధ్యశ్రీ

1 రాధ :— గీతము :—

గాలి తరగల లోన గానాలు వినిపించె
కదలు తీవెల పూలు శిఖిపింఛ మనిపించె
అలికిడి ఏదైన— నా స్వామి యనిపించె
పికరాజు వనవీధి పలుకరించిన పిలుపు
మురళిగా— తొలివలపు రవళిగా తోచె....
కలల వారాశివై కనులలో నీవు—కదలి
కదిలించేవు స్వామి కాంక్షలల్లాడ
కనిపించ రా స్వామి కని తరించేను....

గోపిక 1 ఈనాటిదా రాధ ఆరాధన? ఫలియించునా తపసు....? కవిపించునా స్వామి....? ఏనాటిదీ కాంక్ష...? చిరవిరహమా దీక్ష....?

గోపిక: 2 పలుకరించిన పలుకు తీయందనాల ప్రభువు మాధవుడుగాని పలవింత పరము కాదు.!

గోపిక: 3 మన మెరుగ రానట్టిదీ అమలినశృంగారము. అనురాగరాగగీతికల రాధ మధురోహలు

ం

గోపిక: 1 ఆ మధురోహలు కుసుమించిన రాకాశశి యామినిలో విరబూచిన బృందావని ఈ ఎద....

గోపిక: 2 తనువే హరిచందనమై తపియించే కామ నలో,.... లాసినీ

గోపిక: 3 ఊ....

గోపిక:2 అందుకొమ్మని ఈ కొమ్మ చేయిచ్చాచి, అంధలేదని పొందు పొందలేధని కుందు—తున్నది. కుందుదెందుకు అందక మంద గించె....?

గోపిక:1 ఈ తరుణ శృంగారమందు; విరహ మొక వినోదమై వెన్నుడు వేధించునా....?

గోపిక:2 హరిది కానిదేది ఈ హరిణాక్షి తనువులో...

గోపిక:3 మరి యేల తపన....?

గోపిక:2 తపన కాదు తరుణీ....తపసే అది లౌకిక మీ యవనిక; విను మదియే వీనులెల్ల పులకించే మధురగాన లహరిక....

2. రాధ:-గీతము:- ఇన్నాళ్ళకు స్వామీ....ఎన్నేళ్ళైన దిరా నీవు రాక

నీ రాక లేక....
గుబులుతోటి గాలి జాలి విసురుతున్న వేళలో
అలముకొన్న ఆశజారి దిగులుగొన్న వేళలో
కనులకు కన్నీరు తప్ప కలలైనా ఎరుగను
కలలెరుగని కనులు చేసుకొన్న పాపమేమి...?
శిఖి పింఛము కానైతి శిరసుపైన తేలియాడ
చిరు అందియ కానైతి పాదముతో చిందులాడ
మురళినైన కారాదా మోవిపైన ఆనియుండ
పూవునైనకారాదా పూజకు నే నోచియుండ....
రసవీణగ మలచు కొనుము రాగాలే రవళించగ
ప్రాణాలే గానానికి ఊపిరులై ప్రవహించగ
నీలోనే కలసిపోని మైసోయగ మేలస్వామి
నాలోనే కరిగిపోయి కడతేర్చగ రావేమి....

గోపిక-1 రసరాగ దృష్టి రాధ గానామృతమున హరి తడియలేదొా....? ఏలో ముకుందుడు మోము చాటుగ మిన్నకుండె....హరి సురచిరలలితా కృతి కన్నులారగాంచ మనకు రాధ యొకతే ఆలంబన....

[దూరమున నుండి మురళిగానము విన్పించుచుండును]

రాధ:- వంశినాద శీకరాన ఒడలెల్ల పులకించిన అను భూతికి ఫలసిద్ధి,.... ఆత్మ కృష్ణ సంగీతము. తెరలి తెరలి వస్తున్నది పవనగీతి పాదారం కిద.... కృష్ణా! మురళిరవళి నాదాంకిత పులకిత మీ ఎదలో; సుఖశాంతుల దర్శన మెప్పుడురా! కనించునా నీ సుమసుందర రూపము చిరునవ్వులచిందులలో జీవమెత్తుసౌందర్యము?

గోపిక:—2 నెలవంక లేమితో చినవోయి; దిగులు చుక్కల గుబులు మెరుపులో రాధగా; సందె చీకటి.! మనసుపడి పిలిచేను మాధవా ఆగమన మెప్పుడో—!

గోపిక : 1 లాసినీ;! నాకు చూడ రాధ పూవు పూవును లేపి గంధమలది దిక్కులపై సంధించే వన దేవతగా కనిపించునే! తొలివెలుగుల నెచ్చెలిగా తోచునే....మాటరాని కటిక శిలకు పాట నేర్పు పల్లవిగా........

గోపిక : 2 పల్లవి యన నాయుల్లము చైత్రమాసరుచు పలనే చరించుచు వున్నదే....

గోపిక : 3 క్షణికమైన ప్రాపంచిక పరిధులకే అమరత్వం అందించే అనుభూతుల కందియ; రాధ తోడి; ఆడి పాడి అద్వైతం అనుభవించి మలీ-మస మానసాన్ని తేటపరచుకుందమా!

గోపిక:1 వేణుగానమందు వెన్నెల ననుభవించు వెలది రాధకు కన్నయ్య కథ సుధ; లాసినీ; కథ కదుపు....!

3. గోపికలు: గీతము:

1. ఇది మధుమత్తగంధవహుని దుండగం
2. ఇది కలకంఠకుల కాకలీ స్వరజగం
3. ఇదె వసంత ఋతువిభాసురం-ఆగమం
1. ఇదె శృంగారరసోద్దీపకం-ఈ వనం

రాధ: కాదు కాదిది వసంత మాసం
శిఖిపింఛమౌళి మోవి హాసం
కాదు కాదది కలకోకిల స్వరం
మధుకర మృదుమురళీ రవం
కాదు కాదది గంధవహుని దుండగం
కృష్ణలీల నెత్తావుల సంబరం—ఈ జగం....

గోపికలు:—మురళి రవళి వినరాదె
శిఖిపింఛము కనరాదె
నీలమేఘ శ్యామము
నింగి విడిచి దిగిరాదే
ఏదే-నీ వనమాలి
వివరించవె-సుకుమారి.......

రాధ: విను దవ్వుల అదిగో-ఆ సవ్వడి
ఘనశ్యాముని పన్నీరజ యుగళిది
విను మువ్వల మురళీ మధుగీతము
లౌకిక యుగరాగబంధ వీతము

రాధ: వచనము:-

సఖులార! ఎద సవ్వడి యదుపాలుని పద యుగళిది కాదా! మాధవు మధురోహలె మన ఊపిరి కాదా! ముచ్చివించు నవనీతము రాగ బంధమవదా? ఆరాధన పరతత్వము; అను భూతియె అద్వైతము........

గోపిక : 2 అద్వైతమా....?

రాధ: కాదామరి....? అందరి మనముల తానై అందరి పలుకుల తానై -అందరి కనులకు కలగా.చితా

లకు వెన్నెలగా గోవులకు- గోపెమ్మలకు
గోవిందుడు కాడా అద్వైతుడు....?

గోపిక : 3 అంతవాడు ఇంత పిలుపు వినలేదో ఇంతీ.

గోపిక : 1 రాధ మనసు తెలిసి కూడ రాకపోయె నేమే...?

గోపిక : 2 రాధ ఏల....? రసికతకు రాచకన్నె సత్యభామ లేదో?

రాధ: అహము కాదు ఆరాధన; తనను తాను తెలిసికొనని పలవింతలు పులకింతలు కావు చెలీ! ఆత్మసుమం అర్పించే బ్రతుకే కద ధన్యం.

గోపిక : 3 సురలకు మునివరులకు మరులు కొలుపు మాధవుని తలపులకే పులకరించు; మా కనులకు స్వామినుండి ప్రవాసమా....?

రాధ: ఎదలో పలి గుడిలోపల ఎదిగి పోయి స్వామి..

గోపిక : 2 నీ ఊహల చెరసాల నడుమ బందీయై యుంటే

గోపిక : 1 మా కథ నిశ్శబ్దం;

గోపిక : 2 మా ఎద నిర్వేదం

రాధ: కాదు సఖీ! నిర్వేదం! కారాదు!

గోపిక : 1 కావచ్చును కాని....గోసంత్రాణ సుశీలుడు గోవిందుడు నీకు కదా ప్రాణసఖుడు........ నీవేమొ కాదా కంసారి ప్రాణానికి ప్రాణం...?

రాధ: నానుండి వెన్నుడు వేరు కాదు చెలీ....

గోపిక : 1 వేరుకాని వెన్నునికై వెదికెదవే;....

గోపిక : 2 లలిత తమాల పల్లవనికుంజ వీధిలో

గోపిక : 3 మలయచందన మైత్రీకషాయ మాధురులు మోహన ముర్మురించు పవన కెరటాలలో

గోపిక : 2 చలిత లతాంత పల్లవ రసాల తరుశాఖా చయములో

గోపిక : 1 యమునలో

గోపిక : 2 బృందావనములో

గోపిక : 3 పరుగువెట్టు పాథోరాశి కెరటాల పర్వు నుర్వులో

గోపిక : 1 దిగంతవికాసచంద్రికా హేలలో

గోపిక : 2 వెదికి....వెదికి....దేనికని....?

రాధ: మనసునుండి వేరుకాని మనోవస్థలన్ని.... కాదు చెలి శోధన....ఆత్మార్పణకై వేదన....

గోపిక : 2 కరుణించని వల్లభుచిత్తము నీ యుల్లము గీతమైనచోట రసగంగగ ప్రవహించగ– మున్కలెత్త మా కారాటము—.

**4.** రాధ: గీతము:

ఎదురు చూచింది రాధ-ఎదను పరిచిందిరా
కనుల నిలిపింది రాధ-కదిలి రావేలరా...
నీలి నికుంజము
తారల పూచెను
మాలిక లల్లి-నీ
మెడకు వైతురా....
ఎడద వెడదగా
గుడిగా చేసితి
కనికరించరా-ఎద
నధివసించరా....
వంశీరవము-వకుళ సుగంధము
యమునాతటిని అలలై వేచెను,
నింగిలోని ఆ నీలమోహనము
కన్నుల నిండి కలలై పూచెను
నీ రాక కొరకు నిలువెల్ల కనులై నిలిచితిరా
నీ రాక లేక–నిలువెల్ల శిలనై మిగిలితిరా

[గాలి వీచినట్లు యమున పొంగినట్లు-పూలు రాలినట్లు అనుభూతిని కలిగించే సంగీత శబ్దాలు]

గోపిక : 2 ఆ మురళి తత్వప్రసార మీ గాలిని

కౌగలించినట్లు మేజుగీతానురూపమైన మాధవ
వదన సీమ కదలికల లీనమైనది కదా రాధ..

గోపిక : 3 అమృతమయమైన ఈ భావనలో రాధ
పులకాకింతయైనది; ఏమియో మాటలాడు
కొనుచున్నది తనలో తానై........

రాధ: ....ఇటు కదలి-అటు కదలి....నడచి-బడలిన
స్వామి వక్షమందు పాదముంచవోయి. పద
పల్లవము మోయు ఉల్లమోయి. నీ ప్రేమ
నాలోన సత్యవాసంతమే! కాకున్న తొడిమ
వీడని-పూవు నేనెట్లు కాదలతు....?

నిదుర ఏరుగని నాకు; నిత్య స్వప్నవాసివి
కదా? ఇదేమి వింత! నీ కరముల కరగి, నీరై
పోయిన మతికి మరొక రూపమా? నీ చిరు
గజ్జియల పదనర్తనాన—నా నా ఎద
ఏమైనది....? నీ మురళి గానలహరిలోన
మునిగినట్టి మనసేది....?

కల కాదని తెలిసినట్టి కలతోపలి స్వామి...?
నీకు నేను ఎవ్వరిని....?

గోపిక: 1 కాలాన్ని-లోకాన్ని-కనువిచ్చని పసిపాపగ,
కన్నతల్లి రాధ....వెలుగుకై వెదుకులాడు
వెర్రితల్లి బాధ....

గోపిక; 2 వలపుకాని వలపు తలపు లాగ; రేయి
కడుపున వెలుగు
రేఖలాగ; తనువు మరిచిన భక్తి తపనలాగ....
రాధ....

5. రాధ: గీతము:

మధురమోహనమూర్తి వినిపించు నీ మురళి
చలన మాగక మునుపె-చరణాల చేరగా
విశ్వాన నీ గీతి విపుల మోహన మాగ
నీ ఊర్పు నెత్తావి జగతి ఊపిరి కాగ
నీ గీతి మాధురిని నిఖిల జగములు సోల
నా ఎడద ఓడులో వలపు పచ్చలు తేల
నీ పాద పద్మాల నిలచిపోయిన రాధ
యుగ యుగమ్ముల దాక సంకేతమౌ-గాథ
ఈ రాధ హృదయాన....
వినిపించు నీ మురళి....

గోపిక: 2 నందగోపబాలుడు ఆనందమయుడు
వసుదేవ తనయుడు భక్తజన రక్షకుడు
పల్లవిచిత్తపంకేజభాస్కరుడు-ఇంత వేడిన
కాని
దయజూపడేమి....?

గోపిక: 1 వనమాలి దయాపరమాల కోరు; నీవు
గాని; నేను గాని రాధ పథమున అడుగువేయ
గలమా; అది యేమి చిత్రమో....

గోపిక: 2 పలుకనే పలుకదు పలికిన పలుకెల్ల కృష్ణ
లీలా తరంగమాల యౌను.

గోపిక: 3 కదలనే కదలదు కదలిన కదలికే కృష్ణ
సంస్కృతనాట్యభంగిమౌను.

గోపిక: 1 చూడనే చూడదు కనులెత్తి చూచెనా
చూపు చూపున భక్తి పారవశ్యమె గాని

గోపిక: 2 ఊపిరే తీయదు తీసెనా ఊపిరి కృష్ణ
మంత్రాసక్తకృతపవనమే గాని

గోపిక: 2 లాసినీ.... ! రాధ రాగాతిశయముచే
రవళించు హరిగానమున బడి పోవుచున్నది;
ఎటనుండియో తెరలు తెరలుగా నందబాలుని
గీత మీ పవన పత్రాల తేలివచ్చుచున్నది....
ఆ గీతి; వినుడు ఆ దారి కనుడు.

పురుష కంఠం 6 గీతము:

తపసే ఫలియించిన తరుణీ యిటురావో
ఆరాధనలో నినిచిపోవు అద్వైతము కావో

గోపిక: వచనము:

ఆరాధన రాధ పిదప నిలుచు మాట

పు. కం. గీతం:

రాధ మనసు మందిరమై లోకమందు నిండగా
పూజ కొరకు పూలెందుకు రాధ హృదయ
ముండగా

గో. వచనం:

భగవంతుని హృదయంలో నెలవు చూసు
కొన్నది.

పు. కం. గీతం:

భేదభావ మేనాటికి ఎరుగనట్టి భావన
తాదాత్మ్యము చెందగోరు రాధ జగతి దీవెన.

గో. వచనం: ఆచరణకు సంకేతం; అనుభూతికి అద్వైతం; పరమహంస పావని ఈ రాధ. చరిత నిలచు మహా పుణ్యగాథ. గాలి వీచు నందాక; వెలుగు తోచునందాక; రాధ చరిత అమరం; రాధ గాథ అజరం....



దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర
హైదరాబాద్-4
ఫోను. నం. 84417

# హిందీ స్నాతకోత్తర కాంప్లెక్స్, హైదరాబాదు

-వేమూరి ఆంజనేయశర్మ
రిజిస్ట్రార్

## ప్రశ్నలు-జవాబులు

(1978 అక్టోబరు పదో తేదీన విజయదశమినాడు హైదరాబాదులో హిందీ స్నాతకోత్తర కాంప్లెక్సుకు ప్రారంభోత్సవం జరిగింది. ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ మర్రి చెన్నారెడ్డిగారు కాంప్లెక్సును ప్రారంభించారు. కాంప్లెక్సుకు సంబంధించిన వివరాలు.)

ప్రశ్న:- దక్షిణ భారత హిందీ ప్రచార సభ మహాత్మాగాంధీగారు ప్రారంభించిన ప్రజాహిత సంస్థ. ఆ సంస్థ దక్షిణదేశంలో చాలా కాలం నుండి హిందీ ప్రచార వ్యాప్తికి తోడ్పడుతున్నది. ఆ సంస్థ కొన్ని పరీక్షలను కూడా నడుపుతున్నది. మంచిదే. ఆ సభ ప్రస్తుతం హిందీలో ఎం. ఏ., పిహెచ్. డి. డిగ్రీలు కూడా ఇస్తున్నది. అటువంటి డిగ్రీలు ఇచ్చే అధికారం దక్షిణ భారత హిందీ ప్రచార సభకు ఉన్నదా?

జవాబు:- ఉన్నది. 1964 లో పార్లమెంటులో ఈ సభను జాతీయ ప్రతిపత్తి గలిగిన సంస్థగా గుర్తిస్తూ ఒక ప్రత్యేకమైన చట్టం :అక్టు: అంగీకరించబడింది. ఆ చట్టంలోని నాలుగో నియమం ప్రకారం హిందీకి సంబంధించినంతవరకు యు.జి.సి యాక్టులోని డిగ్రీల నిచ్చే అధికారం దక్షిణ భారత హిందీ ప్రచార సభకు లభించింది. అందువల్ల ఈ సభ హిందీలో ఎం.ఏ., పి. హెచ్.డి. వంటి డిగ్రీలు ఇచ్చే అధికారం కలిగి ఉన్నది. ఆ చట్టాన్ని దక్షిణ భారత హిందీ ప్రచార సభ యాక్టు 1964. అంటారు.

ప్రశ్న:- ఈ చట్టం పార్లమెంటులో అంగీకరించ బడడానికి మీకు ఎవరెవరి సహాయం లభించింది?

జవాబు:- ఈ సంస్థను మహాత్మాగాంధీగారు 1918 లో మద్రాసులో స్థాపించారు. వారు జీవించినంతకాలం వారే ఈ సభకు అధ్యక్షులుగా ఉన్నారు. వారి తరువాత శ్రీ రాజేంద్రబాబుగారు అధ్యక్షులైనారు. ఆ తరువాత శ్రీలాల్ బహదూర్ శాస్త్రిగారు అధ్యక్షులయినారు. ప్రస్తుతం శ్రీమతి ఇందిరాగాంధీగారు అధ్యక్షురాలుగా ఉన్నారు. సభకు జాతీయ ప్రతిపత్తి లభించవలెననే ప్రతిపాదనను ప్రథమంలో శ్రీ రాజేంద్రబాబుగారు ప్రతిపాదించారు. ఆ ప్రతిపాదనకు చట్ట రూపం కల్పించడానికి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రిగారు చాలా సహాయం చేశారు. వారి సహాయమే లేకపోతే పార్లమెంటులో ఈ చట్టం అంగీకరించబడటం కష్టసాధ్యమై ఉండేది. ఆనాటి భారత విద్యాశాఖామాత్యులు శ్రీమాలి, శ్రీ చాగ్లా, శ్రీ భక్తదర్శన్‌లు కూడా సభకు చాలా సహాయం చేశారు. బిల్లును తయారు చేయటంలోనూ, సభ గౌరవానికి అనుగుణ్యంగా దానికి రూప

కల్పన చేయడంలోనూ అనాటి సభ కార్యాధ్యక్షులు శ్రీ డి. శ్రీనివాస అయ్యంగారు ఎనలేని కృషిచేశారు.

ప్రశ్న:- ఈ చట్టం వలన మీ సభకు కలిగిన లాభం ఏమిటి?

జవాబు:- అరవై సంవత్సరాలుగా దక్షిణ దేశంలో జాతీయ భాషా ప్రచారానికి తోడ్పడిన సభకు భారత ప్రభుత్వంవారి మన్ననలభించడం-జాతీయ ప్రతిపత్తి లభించడం-చాలా గొప్ప విషయం. అదే గొప్ప లాభం కూడాను దీనితో సభ చేసిన సేవను ప్రభుత్వంవారు గుర్తించినట్లయింది. యు.జి.సి. యాక్టులోనిడిగ్రీలను ప్రదానం చేసే అధికారం ఈ సభకు లభించడం రెండో లాభం. ఇటువంటి గౌరవం ఇంతవరకు ఏ జాతీయ సంస్థకూ లభించలేదు. వాగ్దానం చేసినంతగా కాకపోయినాకొంత అర్థిక సహాయం కేంద్ర ప్రభుత్వం పక్షాన లభించడం మూడో లాభం. వాగ్దానం చేసిన ప్రకారం కొద్ది కాలంలోనే కేంద్ర ప్రభుత్వం పూర్తి అర్థిక సహాయాన్ని చేకూర్చగలదనే విశ్వాసం మాకు ఏర్పడుతున్నది. అది కూడా ఒక ఉపలబ్ధి అనవచ్చును.

ప్రశ్న:-ఎం.ఏ., పి.హెచ్.డి. డిగ్రీలను విశ్వవిద్యాలయాలు ఇస్తూ ఉంటాయి. ఈ అధికారం మీ సంస్థ కెట్లా లభించింది? మీ సంస్థ స్వభావం ఏమిటి?

జవాబు:- విశ్వవిద్యాలయాలు రెండు రకాలుగా ఉంటాయి. ఒకటి-స్టాట్యూటరీ విశవిద్యాలయాలు, రెండు-డీమ్‌డు విశ్వవిద్యాలయాలు. స్టాట్యూటరీ విశ్వవిద్యాలయాలు చాలావరకు ప్రాంతీయ శాసన సభల తీర్మానాల ననుసరించి స్థాపించబడుతూ ఉంటవి. వారి కార్యక్షేత్రం కొన్ని జిల్లాలవరకు మాత్రమే పరిమితమై ఉంటుంది. డీమ్‌డు విశ్వవిద్యాలయాలు కేవలం రెసిడెన్షియల్‌గా అనగా ఒకే కేంద్రం వరకు పరిమితమై ఉంటవి. కేంద్ర ప్రభుత్వం ప్రారంభించిన కొన్ని సెంట్రల్ విశ్వవిద్యాలయాలు కూడా ఉన్నవి. దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఈ వర్గాలలో దేనికిందకూ రాదు. ఇది ఒక ప్రత్యేకమైన ప్రతిపత్తి గలిగిఉన్నది. విశేషమేమంటే సభ కార్యక్షేత్రం దక్షిణ దేశమంతా వ్యాపించి ఉన్నది. క్రిందటి సంవత్సరం నుండి యీ సభను అసోసియేషన్ ఆఫ్ ఇండియన్ యూనివర్శిటీస్(ఇంటర్ యూనివర్శిటీ బోర్డు)వారు తమ సదస్య సంస్థగా చేర్చుకున్నారు. ప్రజాహిత సంస్థకు ఇటువంటి గౌరవం లభించడం ముదావహమైన విషయం.

ప్రశ్న: ఐతే మీకు యు.జి.సి. నుండి గ్రాంట్లు లభిస్తుంటవా?

జవాబు:- ఇంకా లేదు. యు.జి.సి. యాక్టులో యూనివర్సిటీ అంటేఏమిటో నిర్వచించబడి ఉన్నది. ఆ నిర్వచనంలో పార్లమెంటు చేత జాతీయ ప్రతిపత్తి ప్రసాదించబడిన సంస్థలప్రసక్తి లేదు. యూనివర్సిటీల నిర్వచన నియమంలో అవసరమైన సవరణ జరిగిన తరువాత గాని యు.జి.సి. నుండి సభకు గ్రాంట్లు లభించే అవకాశం ఏర్పడదు. ఆ ప్రయత్నం జరుగుతున్నది. ప్రస్తుతం కేంద్ర ప్రభుత్వమే స్వయంగా కొంత అర్థిక సహాయం చేస్తున్నది. డిగ్రీల గుర్తింపునకు సంబంధించినంతవరకు యు జి సి. యాక్టులో తగిన సవరణ జరిగింది. అందువలన మా డిగ్రీల గుర్తింపు విషయంలో మాకేమీ ఇబ్బంది లేదు.

ప్రశ్న:-మీరు ఎం. ఏ. తరగతులు ఎక్కడ ప్రారంభించారు? ఎలా నడుపుతున్నారు?

జవాబు:- 1964 లోనే దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసులో ఉచ్చశిక్షా ఔర్ శోధ్ సంస్థాన్ అన్న పేరుతో విశ్వవిద్యాలయ విభాగం ప్రారంభించింది. శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రిగారు దానికి ప్రారంభోత్సవం చేశారు. ఆనాటి నుండి సంస్థాన్ పక్షాన మద్రాసులో ఎం. ఏ. తరగతులు నడుపబడుతున్నవి. ఇప్పటివరకు దాదాపు నూటయాభై మంది

వరకు హిందీ ఎం.ఏ. పరీక్షలో ఉత్తీర్ణులై మంచి ఉద్యోగాలు చేస్తున్నారు. ఇప్పటికి పదహారు మంది పి. హెచ్.డి. డిగ్రీ తీసుకున్నారు. పదిహేను మంది ప్రస్తుతం పరిశోధన చేస్తున్నారు. రెండు సంవత్సరాల నుండి మద్రాసులో ఎం.ఫిల్. పరీక్ష కూడా ప్రారంభించబడింది.

ప్రశ్న:-మద్రాసులో ఎం.ఏ. తరగతులు నడుస్తున్నవి గదా? హైదరాబాదులో స్నాతకోత్తర కాంప్లెక్స్ ప్రారంభించారు, దాని అవసరం ఏమిటి?

జవాబు:-ఇంతవరకు మన విశ్వవిద్యాలయాలల్లో నడుస్తున్న భాషకు సంబంధించిన ఎం.ఏ. పరీక్షలు సాహిత్య ప్రధానమైనవి. సభ పక్షాన మద్రాసులో జరుగుతున్న ఎం.ఏ. పరీక్ష కూడా సాహిత్యప్రధానమైనదే. ఇంతవరకు అన్ని విశ్వవిద్యాలయాలల్లో ఇదే విధానం అమలులో ఉన్నది. ఐతే హిందీ రాజభాషగా స్వీకరించబడింది. కేంద్ర ప్రభుత్వానికి సంబంధించిన వివిధ రంగాలలో ప్రభుత్వ కార్యాలయాలలో, బ్యాంకుల్లో, కార్పొరేషన్లలో, రైల్వేలో, తంతి-తపాల శాఖలో—అన్ని రంగాలలో హిందీలో కార్యకలాపాలు జరగడం ఆరంభమైనది ఉత్తరోత్తరా ఆ యా రంగాలలో హిందీకి ఇంకా ఎక్కువ ప్రాముఖ్యం లభించి తీరుతుంది. అనుభవంలో చూస్తున్నదేమంటే సాహిత్య ప్రధానమైన ఎం.ఏ. పట్టభద్రులు ఆ రంగాలలో పని చేయటానికి పనికిరావడం లేదు. అంతేగాక వారి కారణాన హిందీ క్లిష్టం కూడా అవుతున్నదేమో నన్న భయం వ్యాప్తిస్తున్నది. ఆ యా రంగాలలో పని చేయడానికి ప్రయోజన పరమైన(ఫంక్షనల్) హిందీ పరిజ్ఞానం అవసరం అవుతున్నది. యు.జి సి. వారు ఈ విషయాన్ని గ్రహించారు. భారత ప్రభుత్వం కూడా ఈ లోటును గుర్తించింది. అందువలన యు.జి.సి. వారు ప్రముఖ విద్వాంసుల సహాయంతో ఎం.ఏ. హిందీ పాఠ్యక్రమంలో కొన్ని మార్పులు సూచించారు. పాఠ్యక్రమాన్ని సాహిత్య ప్రధానం భాషాప్రధానం అనే రూపంలో రెండు భాగాలుగా విభజించారు. భాషా ప్రధానమైన భాగంలో అనువాద సిద్ధాంతం, కోశ విజ్ఞానం, కార్యాలయ నిర్వహణ, వాణిజ్య వ్యాపారాలు వంటి ప్రయోజనాత్మకమైన విషయాలను ప్రవేశ పెట్టారు. హైదరాబాదు పి. జి. కాంప్లెక్సులో యీ భాషాప్రధానమైన పాఠ్యక్రమం నడుస్తున్నది.

ప్రశ్న:- హైదరాబాదు కాంప్లెక్సులో భాషాప్రధానమైన పాఠ్యక్రమం నడుస్తున్న దన్నారు. మీ అనుభవం ఏమిటి?

జవాబు:- ఇటువంటి పాఠ్యక్రమాన్ని మొదటి సారిగా ప్రారంభించడం వలన మేము చాలా సమస్యలను ఎదుర్కొంటున్నాము. యు. జి. సి. వారు యీ పాఠ్యక్రమం తాలూకు స్థూల రూపాన్ని తయారు చేశారు. తక్కిన వివరాల నన్నింటినీ మేము తయారు చేసుకొనవలసి వచ్చినది. ఆ ప్రయత్నంలో భారత ప్రభుత్వం వారి పూర్తి సహకారమూ, ఆ యా రంగాలలో పని చేస్తున్న విద్వాంసుల సహకారమూ మాకు లభించింది. రెండవ సమస్య పాఠ్యపుస్తకాల కొరతకు సంబంధించినది. ఈ కొత్త పాఠ్యక్రమానికి ఉపయోగించే పాఠ్యపుస్తకాలు చాలా తక్కువగా ఉన్నవి. ఈ సంవత్సరం ఆరు పుస్తకాలను మేమే స్వయంగా ప్రచురిస్తున్నాము. మూడోది ఉపాధ్యాయుల కొరత. దానికి కూడా తగిన ఏర్పాట్లను సభ చేసుకొంటున్నది. ఇంతవరకు కలిగిన అనుభవం ప్రోత్సాహకరంగానే ఉన్నా ఈ పాఠ్యక్రమానికి సమగ్ర స్వరూపం ఏర్పడడానికి ఇంకా రెండు-మూడు సంవత్సరాలు పడుతుంది. ఈ పాఠ్యక్రమం చాలా ఉపయోగకరమైన దనడంలో ఏమీ సందేహం లేదు,

ప్రశ్న:- భాషా ప్రధానమైన యీ కొత్త పాఠ్యక్రమాన్ని యు. జి. సి. వారు రూపొందించారు గదా. ఇతర విశ్వవిద్యాలయాలు దాన్ని అనుసరించడానికి ఏం చేస్తున్నవి?

జవాబు:- యు. జి. సి. వారు రెండు రకాల పాఠ్యక్రమాలనూ అన్ని విశ్వవిద్యాలయాల వారికీ పంపించారు. కొన్ని విశ్వవిద్యాలయాలు కొత్త పాఠ్యక్రమాన్ని అనుసరించడానికి ప్రయత్నం చేస్తున్నవి. చాలమంది మాతో ఉత్తర ప్రత్యుత్తరాలు చేస్తున్నారు. సాహిత్య పాఠ్యక్రమం ఇప్పుడు అమలులో ఉండనే ఉన్నది. రెండవ పాఠ్యక్రమాన్ని కూడా విశ్వవిద్యాలయాలు తొందరలోనే ప్రారంభించగలవని మా విశ్వాసం.

ప్రశ్న:- ఈ పాఠ్యక్రమం హిందీవరకు మాత్రమే పరిమితమా లేక ఇతర భారతీయ భాషలకు కూడా వర్తిస్తుందా?

జవాబు:- ప్రస్తుతం హిందీకి మాత్రమే పాఠ్యక్రమం రూపొందించ బడింది. అన్నిప్రాంతాలలోనూ ప్రాంతీయ భాషలు అధికార భాషలుగా స్వీకరించ బడ్డవి. ఆ ప్రాంతాలలోని విశ్వవిద్యాలయాలు అనుసరిస్తున్న ఎం. ఏ. పాఠ్యక్రమం కూడా సాహిత్య ప్రధానమైనదే. ఆ పాఠ్యక్రమంలో కూడా ప్రయోజనాత్మకమైన స్వరూపం ఏర్పడాలి. ఆనాడే ఆ భాషలో ప్రభుత్వ కార్యకలాపాలు నడపడం తేలికవుతుంది. ఆ స్థితిలోనే ఆయా భాషలు సమర్థవంతమైన అధికార భాషలుగా రూపొందగలుగుతవి. ఆ ప్రాంతాలలోని ప్రజాహిత సంస్థలూ, విశ్వవిద్యాలయాలూ, ప్రభుత్వమూ తగిన కృషి చేయవలసి ఉంటుంది. ఆ ప్రయత్నం ఇంకా ప్రారంభం కాలేదు.

ప్రశ్న:- హైదరాబాదులో ఈ కాంప్లెక్సును స్థాపించడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారి సహకారమేమైనా ఉన్నదా?

జవాబు:- ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారి సహకారం లేకపోతే హైదరాబాదు నగరంలో యీ కాంప్లెక్స్ ఏర్పడేదే కాదు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం యీ కాంప్లెక్స్ కొరకు ఐదు లక్షల రూపాయలు విరాళంగా ఇచ్చింది. కాంప్లెక్స్ భవనాల నిర్మాణానికి వంద ఎకరాల భూమిని కూడా ఇస్తానని వాగ్దానం చేసింది. ఇప్పటికి మూడు లక్షల రూపాయలు అందజేసింది. స్థల నిర్ణయం ఇంకా జరుగలేదు. దక్షిణ భారత హిందీ ప్రచారసభ—ఆంధ్రశాఖ వారి భవనాలలోనే ప్రస్తుతం కాంప్లెక్స్ తరగతులు నడుస్తున్నవి.

--o--

# సాహిత్యగోష్ఠి

## సూక్తి ఔచిత్యము — నన్నయ

'సూక్తి' అనగా దోషములేని, మేలైన, అందమైన మాట. నేడు 'సూక్తులు' అనగానే 'నీతులు' అని మన మనుకొనుట పరిపాటి. కాని కావ్యమందలి సూక్తులకు శిల్పదృష్ట్యా మూడు విశిష్ట లక్షణా లున్నవి, 1. కావ్య కథలో సందర్భోచితముగా అతకబడి యుండుట, 2. పఠితకు హితోపదేశము చేయగలిగి యుండుట, 3. వీనుల కింపైన మాటల కూర్పును గలిగియుండుట. ఈ మూడు లక్షణాలు గల సూక్తి కావ్యమందు ప్రయోగింప బడినచో దానికి ఔచిత్యము అబ్బినట్లే. శతకములందు కథ ఉండదు. కనుక అందలి సూక్తులకు మొదటి లక్షణము వర్తించదు. రెండవ లక్షణమే పరమ ప్రయోజనము, ఇక మూడవ లక్షణము పై రెండు లక్షణాలు నిపుణముగా నిర్వహింపబడుటకు చాల అవ సరమైనట్టిది. సూక్తులు చెప్పునపుడు భావోచితమైన మాటల ఎన్నికతో పాటు వీనుల కింపైన అక్షరముల కూర్పు కూడ ఎంతో ముఖ్యమైనట్టిది. దీనివలన సూక్తులు హృదయాకర్షితములై, కంఠస్థములై, ప్రచారితములై తమ ప్రయోజనములను నెరవేర్చు కొనుటకు వీలగును.

ప్రస్తుతము నన్నయ సూక్తి ఔచిత్యమును నిర్వ హించిన తీరును పరిశీలింతము. ఆయన భారతమును ప్రశంసించినపుడు "నీతి విచక్షణుల్ నీతిశాస్త్రంబని, కవి వృషభులు మహాకావ్య మనియు, లాక్షణికులు సర్వ లక్ష్య సంగ్రహమని" (ఆది 1. 32) చెప్పిన వాక్యములలో నీతి—కావ్యశిల్పము—శబ్దముల సాధు త్వము అను మూడు భావములు, ముందు చెప్పిన సూక్తి యొక్క మూడు లక్షణముల లోని మొదటి దానితో కావ్యశిల్పము, రెండవదానితో నీతి, మూడవ దానితో శబ్దముల రమణీయత సంవదించుచున్నవి.

నన్నయ తన కవిత్వములోని ప్రధాన లక్షణములను గూర్చి చెప్పుకొనునపుడు "నానా రుచిరార్థ సూక్తినిధి" త్వమును గూర్చి కూడ చెప్పెను. దీనినిబట్టి నన్నయ ఉచితములైన సూక్తుల ప్రయోగమందలి నిపుణత్వము ప్రియత్వము వ్యక్తమగుచున్నది. తన సూక్తులు నానా విధములైనట్టివనియు, నానా రుచిరము లైనవనియు రుచిరార్థ నిర్వహణ సామర్థ్యము లనియు, అవి తన కీర్తికి నిధులనియు భావించె నని చెప్పవచ్చును. 'రుచి రార్థ' మనుచోట రెండర్థము లున్నవి, ఒకటి, తన సూక్తులు చక్కని ప్రయోజనమును నెరవేర్చుననియు, రెండు, అభీష్టములైన అర్థముల నిచ్చుననియు చెప్ప వచ్చును.

నన్నయ తన భారత భాగమందు ముఖ్యముగా ఆది- అరణ్య పర్వము లందు సూక్తులను మెండుగా ప్రయో గించెను. ప్రస్తుతము ఒక ఉదాహరణ ద్వారమున మాత్రమే నన్నయ సూక్తి ప్రయోగమందలి ఔచి త్యమును పరిశీలింతము.

ఉదా :— గరుడోపాఖ్యానమందు వినత తనకు దాసీ త్వము కలుగుటకు గల కారణములను కొడుకైన గరుడునకు వివరించి "కొడుకులు సమర్థులైనం దల్లి దండ్రుల యిడుమలు వాయుట యెందునుం గలయది" (ఆది. 2–51) అని లోక సామాన్యమైన, సమ్మాన్య మైన సూక్తిని చెప్పెను. ఇందు లోకమందలి కొడుకు లందరికి శిరోధార్యమైన నీతి స్పష్టముగా చెప్పబడి నది. ఇది కథా సందర్భము యొక్క ఔచిత్యమును గూడ కలిగియున్నది ఎట్లన ఈ సూక్తిని విన్న వెంటనే

గరుడుడు తన తల్లి దాసీత్వమును తొలగించుటకు గొప్ప ప్రయత్నము చేసి, అమృతాపహరణము చేసి, తెచ్చి, మాట ప్రకారము పాముల కిచ్చి తాను సమర్థుడైన కొడుకు' గా తల్లిదాస్యమును తొలగించెను. ఈ విధముగా ఈ సూక్తి జరుగబోవు వృత్తాంతమునకు ప్రేరణగా, చక్కని మలుపుగా నుండి 'రుచిరార్థ నిధి' త్వమును కలిగియున్నది. ఈ సూక్తి లోని వీనులకింపు నింపు కూర్పు చూడుడు, 'కొడుకులు' - 'ఇడుమలు'- 'కలయది' అని సమాన లఘ్వక్షరముల కూర్పు; 'తల్లిదండ్రుల'–'ఎందును గల' అను వాని సమతౌల్యము ఇవి సూక్తికి శ్రవణపేయత్వమును కలిగించుచున్నవి.

పై విధముగా ముందు చెప్పిన సూక్తి యొక్క మూడు లక్షణములు ఉదాహరణమందు నిండుగా అమరియున్నవి. దీనినిబట్టి సూక్తుల ప్రయోగమందు నన్నయ ఔచిత్యమును ఎంత నిపుణముగా నిర్వహించునో తెలియుచున్నది. తన 'నానా రుచిరార్థ సూక్తి నిధి' త్వమును సార్థకమగుచున్నది.

ఏ. వెంకట రామిరెడ్డి ఎం. ఏ.

# దాశరథి "తిమిరంతో సమరం"

మహాకవి దాశరథి కలం నుండి వెలువడిన మరో ఆణిముత్యం లాంటి కావ్యం "తిమిరంతో సమరం" ఇటీవల వెలువడిన కావ్యాల్లో చెప్పుకోదగ్గ విశిష్ట కావ్య మిది 1972 లో ప్రచురించబడిన ఈ కావ్యానికి కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి కూడా లభించడం గమనార్హం. అంతకంటే గొప్ప విషయం అన్ని వర్గాలవారి మన్ననలనూ అందుకోవడం. దాదాపు మూడు దశాబ్దాలుగా డా. దాశరథి తెలుగు భారతిని తన సుమధుర కవితద్వారా అర్చిస్తున్నారు – "అగ్నిధార" – కురిపించినా, "రుద్రవీణ" మ్రోగించినా, "అమృతాభిషేకం" కావించినా, "మహాంద్రోదయం" కోసం ఉద్యమం సల్పినా ఆయన మానవజాతి కళ్యాణానికే పాటుబడుతున్నారు. విశ్వశాంతిపట్ల మహాదాకాంక్ష "గాలిబ్ గీతాల" ద్వారా ఉర్దూ కవిత్వంలోని అందచందాలను మన కందించి, మాధుర్యాన్ని గ్రోలజేసి, "కవితా పుష్పకం" ద్వారా విహాయస యానం చేయించారు.

దాశరథి మహాకవి. మహాకవి హృదయం మానవజాతి కులాల పేరుతో, మతాల పేరుతో, తన్నుకు చావడంచూసి సహించదు. అందుకే 'శాంతి'ని ఆహ్వానిస్తూ అంటాడు.

"ఇరువదవ శతాబ్దంలో
ఇంచుమించు ముప్పాతిక గడచిపోతున్నా
పుచ్చిపోయిన కులాలతో
చచ్చిపోయిన మతాల పేరుతో
తన్నుకు చచ్చే మమ్ములను చూసి ఖిన్నవై
యెన్నడూ రాననబోకు—" అని.

విశ్వ కళ్యాణాన్ని కాంక్షించి ఈ కవి నాగార్జున సాగారాన్ని చూసినపుడు

"నవచరితకు నాందియైన
నాగార్జున సాగరము
తెలుగింటను కలిమి నింప
గలుగు క్షీర సాగరము" అని ఆనందంతో గానం చేశాడు

'తిండి లేని వాడెవ్వడు
ఉండబోడు ఏనాడు,
చదువురాని వాడెవ్వడు
వెదికినను కానరాడు" అని అనడం కవి భవిష్యద్దర్శనం– దురాశ మాత్రం కాకూడదు.

లోకంలో మంచిని చూసినపుడు ఈ కవి ఎంత ఆనందిస్తాడో, అన్యాయం, ఆక్రమాలను చూసినపుడు ప్రళయకాల రుద్రుడే అవుతాడు.

"జుగుప్సను చుట్టి పారేయండి
క్రౌర్యాన్ని కట్టి పారేయండి
భీభత్సాన్ని విసిరి పారేయండి
నైచ్యాన్ని నలిపి పారేయండి

కలాన్నీ, గళాన్నీ
కమనీయ శబ్దాన్నీ, తదర్థాన్నీ
ఆరాధించడానికి బదులు
అవమానించే ధీమతులను
ఆక్షేపించండి — శిక్షించండి.''

దాశరథికి తెలుగన్నా, తెలుగునాడన్నా వల్లమాలిన అభిమానం. ఈ అభిమానం అనేక కవితల్లో తొంగిచూస్తుంది. ఉదాహరణకు "అక్షర నక్షత్రమాల'' అనే కవితలో అంటాడు—

అమ్మా నా ఆంధ్రమాత
అమ్మను గన్న నా భరతమాత
అమ్మల గన్నమ్మల గన్నమ్మ ఆ జగన్మాత
కన్నీళ్ళను కాల్చకుండ కళకళ లాడాలి''

మోడుగుపూలను చూసి వర్ణించిన తీరు ఆయన అభ్యుదయ భావాలకు, ప్రగతి వాదానికి అద్దం పడుతున్నది. చిత్తగించండి.

"ఈనాడు—
నియంతల దురంతాలకు బలియైన
మహావీరుల గుండెల వలె
దండలు దండలుగా
ధరణి జనని గళసీమ
తళతళలాడుతున్నవి''
ఒక్కొక్క మోదుగుపువ్వు చెప్పే
కరుణామయ కథలతో
కవ్వాలల్లాలని
కలం తొందర పడుతున్నది.''

దాశరథి రాచరికాన్ని నిర్భయంగా ఎదిరించాడు. నిర్మొహమాటంగా విమర్శించాడు. ''మా నిజాము నవాబు జన్మజన్మాల బూజు'' అన్న దాశరథి. "భవిష్యత్తుకు స్వాగతం'' లో "మహారాజులా మొహం నిండా బూజుతో గతంపై మోజుతో మదగజం మీద అవరంజి అంబారీలో వస్తే దుర్నిరీక్ష్య హార్యక్షాన్నై అమాంతం లంఘించి, ఆ గజాన్ని గజారూఢుణ్ణీ అంతం చేస్తాను'' అంటాడు. నిప్పులాంటి నిజాన్ని దాచనివాడు, నిర్భయంగా గుండెలు ప్రద్దలయ్యేలా, వెల్లడించే వాడే నిజమైన కవి. అందుకే దాశరథి అంత నిర్భయంగా అనగల్గినాడు.

దాశరథి "అజ్ఞాత యోధుణ్ణి'' సంస్మరిస్తూ వ్రాసిన కవిత ప్రశంసార్హమైంది.

"తామ్రపత్రం కోరలేదు
ఛాయాచిత్రం నోచలేదు
అతనికి కావలసింది దేశం
అతని వరనరాల ఆవేశం''

దాశరథి కవిత్వంలో అకుంఠిత దేశభక్తితో పాటు, భవిష్యత్తుపై అచంచల విశ్వాసం వుంది. దాశరథి ఎంత విప్లవమూర్తియో, కావ్యంలో అనేకచోట్ల శృంగారాన్ని కూడా కుమ్మరించాడు. రెండువైపులా పదును వున్న కత్తిలాగా ఒకవైపు విప్లవాన్నీ మరొకవైపు శృంగారాన్నీ మెప్పించడం చాలా కష్టం— "రాజీవ గీతం'' లో అంటాడు—

"పరువం పొంగే తరుణి నయనాలలోని
వెచ్చదనాన్ని పచ్చడంలా కప్పుకుంటాను''

అని గమ్మత్తుగా. గడుసుగా అన్నప్పుడు మనస్సుకు గిలిగింతలు కల్గుతుంది. మరోచోట "జ్వాలాసుందరి'' అనే కవితలో అంటాడు—

"కప్పుకోడానికి—దుప్పటి లేనివాణ్ణి
గడగడలాడించే చలి''
బెదదనుండి కాపాడేందుకు
మంచు ముసుగు తీసేసి
అంచవడలతో అరుదెంచిన
జ్వాలా సుందరి ఒడిలో
కాలడంకంటే సుఖం లేదు.''

దాశరథి కవిత్వం విశ్వజనీనమైంది. ప్రపంచంలోని ప్రతి సంఘటనకు, స్పందించే హృదయం కలవాడు, దాశరథి. "వ్రణాల తోరణాలు'' లో అంటాడు.

''ఎంద రెందరు గాయ పరిచారు నన్ను
ఎన్నెన్ని సంఘటనలు గాయపరిచాయి నన్ను
గాంధీని వధించిన ఘాతుకుడు
నాలుగో తుపాకి గుండు
నా గుండెల్లోకి ప్రయోగించాడు''.
"కెన్నెడీని చంపిన దున్నపోతు
నన్నూ ఒక దెబ్బ తీశాడు

వియత్నాంలో పేలిన ప్రతిబాంబు
నాహృదయంలో అంచుల్లో మంచం
వాల్చుకొని పడుకుంది.
సూయజ్ కాలువ ఇరుప్రక్కల లేచిన రణజ్వాల
నా గుండెల్లో పాలాశారుణ కుసుమమాల"
నా మానని గాయాల వజ్రాయుధాలతో
అధికార, మదాంధుల
బధిర హృదయాలను బ్రద్దలు కొడతాను"

అని గర్జిస్తాడు.

దాశరథి ఎంత తిరుగుబాటు వాదియో అంత శాంతి కాముకుడు. అహింసద్వారా విజయాన్ని సాధించి శాంతిని స్థాపించాలన్నది ఆయన ధ్యేయం. హింస ద్వారానే సమసమాజాన్ని స్థాపించాలనే తొందర పాటును గర్హిస్తూ "ఉద్భ్రాంత యువశక్తి" అనే కవితలో అంటాడు—

"హింస నుండి సమ సమాజ
హింస ఉద్భవించుననే
అసత్యాన్ని నమ్మకు
హంతకుడవు కాబోకు" అని నాగరికత పేరిట వెర్రితలలు వేస్తున్న నాగరిక ప్రపంచాన్ని గురించి వ్రాసిన ఈ ఖండికలో ఎంతో సంయమనం వుంది. చిత్తగించండి.

"కొత్తపాట పేరుతో చెత్తపాట పాడకు
కొత్తదనం నీడలో రిత్తదనం పెంచకు
గుడ్డవిడిచి నడ్డివిరిచి రోడ్డుమీద నడవకు
ఇజాలతో భుజం కలిపి నిజం దాచజూడకు"

ఇది సభ్య ప్రపంచానికే ఒక సవాల్.

"తిమిరంతో సమరం" అనే ఖండిక ఈ కావ్యంలో చెప్పుకోదగినది—

"ఎత్తులపై ఎత్తులతో
జిత్తులపై జిత్తులతో
ఎత్తే విజయ పతాకం
ఎన్నాళ్ళని యెగురుతుంది.
"అయ్యో ఈ రాజకీయ
హాలాహల సంతర్పణ
ఎంతకాలమిలా ప్రజా
హంతకులకు ఆనందం."

ఇది సమకాలీన రాజకీయాల పట్ల చెణుకు. ప్రస్తుత పరిస్థితులకు దర్పణం. ఈ ఖండికలో గొప్ప సందేశాన్ని అందించాడు కవి. ఇది విలువైంది. మానవాళి గమనించ దగింది.

"ఇంకుతున్న మానవుడా
ఇంకనైన మేల్కాంచు
తుపాకీల హతం చేసి
కృపాకీల వెలిగించు"
తిమిరంతో ఘన సమరం
జరిపిన బ్రతుకే అమరం
కవితా తేజో వలయం
అవని శాంతి కది నిలయం"

"పైస కింత విలువనిచ్చే పాడు విధానం పోయి, మనిషి కింత విలువిచ్చే మంచిరోజు రావాలి" అన్నది దాశరథిగారి గొప్ప ఆశయం. నిజంగా ఆ రోజు వస్తే ఎంత బాగుండును అనిపిస్తుంది. అంతకంటే మనకు కావల్సిందేమిటి !

దాశరథి కవిత్వంలో అడుగడుగునా ఆకర్షించే గుణం విశ్వ మానవ శాంతి కోసం నిరంతరం ఆయన హృదయం పడే తపన.

"మధుర క్షణం" అనే కవిత మరచిపోలేని మధుర కవిత. నిరంతరం మనస్సులో మెదిలే మానస గీతం—

"ఈ క్షణం ప్రతి కొమ్మ
మామిడికొమ్మయై వికసించనీ
ఈ క్షణం ప్రతి మనిషి
మాధవ దేవుడై విహసించనీ
ఈ క్షణం తెలుగింట
సమరసభావమే నివసించనీ
ఈక్షణమ్ముల ముందు
వ్రాలిన ఈ క్షణం మధురక్షణం"

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వ ఆస్థానకవి, ప్రజాకవి

మైన డా॥ దాశరథి కలం నుండి మరిన్ని మహత్తర కావ్యాలు వెలువడాలని ఆకాంక్ష.

తాళ్ళపల్లి మురళీధరగౌడ్

# మోరియా గారి శ్రవ్య నాటికలు

సమాజానికి ప్రతిబింబం సాహిత్యం. ఆయా సామాజిక స్థితిగతులు, మానసిక వికారాలు, సాంఘిక లోపాలు మొదలయిన అనేకానేక విషయాలు సమకాలీన సాహిత్యంలో ప్రస్ఫుట మౌతుంటాయి. సంఘంలో తాను చూసిన బలహీనతని, దౌర్బల్యాన్ని, దౌర్భాగ్యాన్ని ప్రతిభావంతుడైన రచయిత ఎత్తి చూపుతూ ఒక కావ్యం లానో, ఒక నవలగానో, ఒక నాటకంగానో శిల్పాన్ని సంతరించుకొని, తద్వారా ప్రదర్శిస్తాడు. ఇంకా సైద్ధాంతిక అవగాహన ఉన్న రచయిత అయితే ఈ సమస్యలకు సరియైన పరిష్కారాన్ని కూడ సూచిస్తాడు. నిజమయిన రచయిత ఏనాడైన సమాజానికి ఒక గైడ్ లాంటివాడు. సంఘం లోని మంచి చెడుల్ని వివేచించి చెబుతూ, మంచివేపు పురోగమించాల్సిందిగా పాఠకులకు తన రచన ద్వారా సందేశాన్నిస్తాడు.

స్వీయ మాతృభాష తెలుగు కాకపోయినా— తెలుగు సాహిత్యంలో ఒక సుస్థిర స్థానాన్ని సంపాదించుకున్న కొంతమంది అన్యభాషా రచయితల్లో శ్రీ హీరాలాల్ మోరియా ప్రధానమైన ప్రతిభావంతమైన సాహిత్య స్రష్ట. బెంగాలీ రచయిత శరత్‌చంద్ర లాగా, హిందీ రచయిత ప్రేంచంద్ లాగా, ఉర్దూ లిపిలో సృజన చేసి, కౌముది వంటి సమర్థులతో తెలుగునందు అనువదింప జేసి, తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేస్తున్న మోరియా రచనలు తెలుగు ప్రజల ఆదరాభిమానాలను చూరగొంటూనే ఉన్నాయి. మోరియా అనే పేరు వినగానే "గుడిమెట్లు", "తెగని గొలుసులు" నవలలు, "మిన్నేటి పొంగులు" కవితా గుర్తొస్తాయి. అవి పాఠకుల మనస్సుల నాకర్షించిన రచనా సంవిధానం అటువంటిది. దాదాపు యాభై సంవత్సరాల వయస్సు దాటినా ఈనాటికీ కనీసం రోజుకు ఆయిదారు గంటలపాటు సమయాన్ని సాహిత్య సృజనకు వినియోగిస్తూ ఉత్తమమైన కళా శకలాల్ని నిర్మిస్తున్న హీరాలాల్ మోరియా గారి మెదడే ఒక విజ్ఞాన భాండాగారం. మనసు ఒక కళా సౌందర్య క్షేత్రం. అసలు ఆయనే ఒక గ్రంథాలయం. ఉన్నతమైన ఆలోచనలతోనూ, అనుభూతులతోనూ నిండిన కళాశిల్పి. అందుకే వారి చేతిలో కవితైనా, నవలైనా, చిన్న కథైనా, నాటకమైనా, చివరికి కీ.శే. జమలాపురం కేశవరావు వంటి దేశభక్తుని జీవిత చరిత్రైనా, ఏ ప్రక్రియైనా సర్వాంగసుందరమైన తెలుగువారి కోడలుపిల్లలాగా అందంగా ముస్తాబై ఆనందాన్నీ, ఆవేదన్నీ, సంతోషాన్నీ, సందేశాన్ని, ఇలా జీవితంలోని వివిధ రుచుల్నీ చవి చూపి ఉత్తమమైన కావ్యకుమారిగా తన వంతు బాధ్యతను తాను సక్రమంగా నిర్వర్తిస్తుంది.

ఇహ మోరియా గారు రచించిన శ్రవ్య నాటికలు ఈనాటి సామాజిక బలహీనతలకు ప్రతీకలు. వీరు సృష్టించిన ఆయా పాత్రలు - సంఘంలోని ఆయా మనో వికారాలను కలిగి ఉన్న వ్యక్తుల చిత్రీకరణలు. అందుకే సాధారణంగా చాలా నాటకల్లో చివర— "ఇందులోని పాత్రలు కేవలం కల్పితాలు, ఎవరినీ ఉద్దేశింప బడినవి కాదంటూ" వ్రాసుకునే విధానానికి భిన్నంగా మోరియా గారి నాటికల్లో— మొదట్లోనే— "ఆయా మనస్తత్వాలు గల వ్యక్తులందరికీ ఈపాత్రలు వర్తిస్తాయి" అంటూ నిర్భయంగా, ధైర్య గా సూచన చేసే విధానం కనబడ్తుంది.

ఇక వీరి రచనల్ని విడివిడిగా పరిశీలిద్దాం.

## "నల్ల బంగారం"

ఇదొక చక్కని చమత్కారభరితమైన శ్రవ్య నాటిక. చదువు, సంస్కారం పెంపొందుతున్నప్పటికీ, ఈనాటికీ సమాజాన్ని పీడిస్తున్న అనాచారం వరకట్నం — ఇందులోని ప్రధానాంశం. ఇక రెండవది స్త్రీరూపం. నిజానికి స్త్రీ మనస్తత్వాన్ని గానీ, స్త్రీ మమకారాన్ని గానీ, నిర్ణయించేది ఆమె యొక్క బాహ్యాగతమైన రూపంకాదు, ఆమెలోని సంస్కారం మాత్రమే. కానీ

ఈనాడు దాదాపు అందరు యువకులూ, యువతుల యందు ప్రధానంగా చూస్తున్నది చాలావరకు కేవలం ఆమె యొక్క బాహ్యగత శారీరక సౌందర్యం మాత్రమే. ఇంకా పరిశీలనాత్మకంగా చూస్తే ఈ రూపవతులైనా, కురూపులైన వరుల్ని కట్నమిచ్చి కొనాలి. ఒక ఇంట్లో ఆడకూతురి పెళ్లి జరిగింది, అనంటే అర్థం— ఆయింటి ఆడకూతురి కోసం ఒక పెళ్లి కుమారుడిని ఈ సంఘమనే సంతనుండి కొని, తెచ్చి ఇచ్చారనే అర్థం చేసుకునేంత స్థాయికి ఈ సమాజం ఎదిగిందన్నమాట. చాలా మంది మేధావులు, విద్యావంతులు వేదికల నధిరోహించి ప్రసంగిస్తూనే ఉంటారు. సంఘం మారింది, మనుషులు మారాలి అంటూ. అయితే ఈ నినాదాలన్నీ కేవలం సభలకీ, సమావేశాలకీ, రంగస్థలాలకీ మాత్రమే పరిమితమై పోతున్నాయి. చదువుతోపాటు సంస్కారం పెరుగుతుందంటారు, కానీ చాలామంది విషయంలో ఇది— "చదవేస్తే ఉన్న మతి పోతుంది" అన్నట్లు ఇంకా తరిగి పోతున్నట్లే అనిపిస్తుంది. డిగ్రీలనుబట్టి వాడు ఆశించే కట్నం రేటుకూడా పెరుగుతుంది బి.ఏ. అయితే ఇంత. ఎమ్మే అయితే ఇంకింత. ఏ డాక్టరో ఏక్టరో, డైరెక్టరో, ఇంజనీరో, లాయరో అయితే ఇంతింత అంటూ రేట్లుపెట్టుకుని పెళ్ళి చూపులు కుదుర్చుకోడం సామాజిక పతనానికే సంకేతమంటూ ఈ నాటిక ద్వారాస్పష్టంగా వ్యక్తపరిచారు రచయిత. ఇందులోనే మరో విషయం. అమ్మాయి చాలా అందంగా ఉంటే కట్నంలో కొంత డిస్కౌంటు. ఒక మోస్తరుగా ఉంటే నో కన్సెషన్. ఇహ దురదృష్టవశాత్తూ ఏ లోపమైనా ఉంటే దాదాపు మామూలు కన్నా రెట్టింపు అంటూ కట్నం ధరల్ని పెంచే వెంకట్రామయ్య వంటి వరుడి తండ్రి పాత్రని సమర్థవంతంగా మన కళ్ళముందు చిత్రీకరించారు రచయిత.

ఈ నాటికలోని నాయిక — 'శాంత! చక్కని సంస్కారవంతురాలు. చంద్రం, శారదల వంటి అన్నా వదినల ఆప్యాయతల నడుమ పెరిగే ఇంటి ఆడకూతురు. చిన్నప్పట్నించీ అందంగానే ఉండేది. కానీ దురదృష్ట వశాత్తు నాలుగు సంవత్సరాల క్రితం మశూచి వచ్చి ప్రాణాపాయస్థితి నుండి బయట పడింది. ప్రాణాలు దక్కాయి, రంగు పోయింది. లక్ష్మీదేవిలా కళకళ లాడుతూ ఉండే బంగారు బొమ్మ ఇప్పుడు వెలవెల బోతున్న సౌందర్యంతో ఉంది. ఎందరో డాక్టర్లను సంప్రదించిన పిదప, ఔషధాలు వాడిన పిదప ఆమె మొహమ్మీద ఇంకా అక్కడక్కడా కొన్ని మచ్చలు మిగిలాయ్. ఆ మచ్చలే ఆమె జీవితాన్ని శపిస్తూ, ఆమె వివాహానికి గొప్ప ఆటంకాలుగా పరిణమించాయ్. చివరికి ఇప్పుడో సంబంధమొచ్చింది వరుడు గణపతి, వరుడి తండ్రి వెంకట్రామయ్య, వారితో బాటు వెంకట్రామయ్య మనుమడు శేఖరం ముగ్గురూ కలిసి పెళ్ళిచూపుల కొచ్చేరు. పెట్టుపోతలు వగైరా విషయాలన్నీ వెంకట్రామయ్యగారూ, శేఖరం మాత్రమే మాట్లాడుతున్నారు, గానీ వరుడు పెదవి కదపట్లేదు.

చివరికి ఉండబట్టలేక అడగనే అడిగాడు చంద్రం— "ఇంతకూ పెళ్ళికొడుకు గారేమీ మాట్లాడరేం?" అని. "మౌనం విభూషణం పండితానాం" అన్నారు. అంటే పండితులయిన వారికి మౌనమే అలంకారం అని తెలుగులో అన్నారు అరవం మనకు రాదు గనక అందులో ఏమన్నారో మనకు తెలియదు. ఇక ఆంగ్లం... హిందీ భాషల్లో...." అంటూ బుకాయించడానికి ప్రయత్నం చేస్తున్న శేఖరాన్ని సరిదిద్దుతూ— "అపార్థం చెబుతున్నారు మరిదిగారూ! మౌనం అనేది పండితులకు అలంకారమని కాదు, మూర్ఖులకు. పెదవి కదిపితే అసలు సంగతి కాస్తా ఎక్కడ బైట పడుతుందో నని, అటువంటి వారికి మౌనమే భూషణమన్నారు" అంది శారద. ఈ దెబ్బతో నిజం ఎక్కడ బైట పడుతుందో నన్న సందేహంతో వెంకట్రామయ్య— "మా వాడి విషయంలో మీ కా సందేహ మేమీ అక్కర్లేదు. నలుగురిలో మాట్లాడాలంటే మా వాడికి కాస్త బెరుకు. అందులోనూ ఆడవాళ్ళ ఎదుటా, పెద్దవాళ్ళ సమక్షంలో మా వాడికి చచ్చేంత సిగ్గు. అందుకని నోరు మెదపడు. అంటూ సమాధానం చెబుతాడు.

ఇంకోచోట— "అబ్బాయి చంద్రం! ఇక్కడ అన్ని విషయాలూ చూశాం, బాగానే ఉంది ఆ కట్నం దగ్గరే మరీ మూడు వేలకు మించదనడం మాత్రం బాగా లేదు. అమ్మాయి చూస్తేనా కొంచెం— కొంచెమేమిటి బాగానే వన్నె తక్కువ. కంటికింపైతే ఇంటి

కించని ప్రతివారూ రూపురేఖలు, అందచందాలు ఆశించడంలో తప్పు లేదుగా. అందుట్లో ఇప్పుడు వాడేమో జ్యేష్ఠుడు, పెద్దకోడలు వలుపైతే వంశమంతా వలుపనీ సాగదీస్తాడు వెంకట్రామయ్య. అలాగే– "ఇంకెక్కడైనా అను గానీ, డబ్బు దగ్గర ఇటువంటి మొహమాటాలు నాకు నచ్చవు. మిడిల్ తప్పిన వెధవ కిస్తున్నారయ్యా మూడేసి వేలు. నేను మట్టుకు కోరిందేముంది. రెండు వేలేగా. పిల్ల చూస్తే అలా ఉంది. కష్టాల కేమొచ్చే, అందరికీ ఉంటాయి. ఎంత చెట్టుకు అంత గాలి" అంటూ ఖచ్చితంగా చెప్పి ఒప్పిస్తాడు ఇహ ఆ కట్నం డబ్బును సమకూర్చడానికి చంద్రం, శారదలు పడే అవస్థలు, ఎదురైన అనుభవాలు, నిరాశలు, చివరికి జీవితంలో ఓడిపోతున్నట్టు కథలో క్లైమాక్స్. ఆ రెండువేలని సమకూర్చలేని కారణంగా పెళ్ళి పీటల మీంచి తన సుపుత్రుడిని లేవనెత్తిన పెద్ద మనిషితో– "వెళ్ళండి. తక్షణం వెళ్ళిపొండి. అసలు నాకీ పెళ్ళి ఇష్టం లేదు. అందం– అందం అని అదేపనిగా గొంతు చించుకుంటున్నారే ఒకసారి మీ అబ్బాయిని కాస్తా అద్దంలో చూసుకోమనండి." అంటూ చెవిటి వాడూ, నత్తివల్ల సరిగ్గా మాట్లాడం చేతకాని వాడూ కుంటుతూ, రొప్పుతూ నడిచే వాడైన పెళ్ళికొడుకుని దెప్పిపొడుస్తూ ఆవేశంగా పలుకుతుంది పెళ్ళికూతురు శాంత. ఆమే వల్లబంగారం. అంతటితో ఆగక భద్రకాళిలా విజృంభించి– "కాలం మారింది! కానీ మీలాంటి ప్రబుద్ధుల మనస్తత్వాలు మాత్రం మారలేదు. ఆడదాన్ని పాతచెప్పులా చూసే నీచబుద్ధి పోలేదు. మీవాడికున్న అవలక్షణాలన్నీ నేనారోజునే కనిపెట్టాను. కానీ మా అన్నయ్య కోసం తలవంచాను. చివరకు– రామరామ! మీ అఘాయిత్యం. మీ కాఠిన్యం, నాసహనాన్ని దహించివేసింది. వెళ్ళండి. మీకేమాత్రం మర్యాద మీద ఆసక్తి ఉన్నా తక్షణమే ఇక్కడి నుండి వెళ్ళిపోండి. కానీ ఆడదానికూ్కడా ఆత్మాభిమానం, ఆత్మగౌరవం ఉంటాయని మాత్రం గుర్తుంచుకోండి. వెళ్ళండి" అంటూ గర్జిస్తుంది. ఇక్కడే కథ మలుపు తిరుగుతుంది.

"క్లైమాక్స్, క్లైమాక్స్ రసవత్తరమైన ఎండింగ్. వండర్ఫుల్" అంటూ శేఖరం ప్రవేశిస్తాడు.

"ఆడదంటే సీత, సావిత్రి, అనసూయే కాదు తాతయ్యా! మహాంకాళి కూడా. స్త్రీ స్వరూపమే సృష్టిస్తుంది, లాలిస్తుంది, పోషించి, ప్రేమించి, పూజిస్తుంది. ఎదురు తిరిగితే సంహారిస్తుంది. ఇప్పుడు నువ్వు చూస్తున్నది ఆడదాని కాళీ స్వరూపమే. ఏయ్! భజంత్రీలు వాయించండి, ఇంతటితో కథ పూర్తవ్వలేదు. అసలు కథ ఇప్పుడే మొదలయ్యింది. ఊఁ! పురోహితులూ కానివ్వండి. ఈ మంగళసూత్రాన్ని నేనిలాగె శాంత మెడలో కడుతున్నాను." అంటూ తన విశాల హృదయాన్ని వ్యక్తం చేస్తూ తాళి కడతాడు శేఖరం. ఇలా సుఖాంత మవుతుందీ నాటిక.

రసవత్తరమైన సన్నివేశ పరికల్పన, పాత్రౌచిత్య సంభాషణా చాతుర్యం, సందేశాత్మకమైన ఇతివృత్తం మోరియా గారి చేతిలో జీవం పోసుకున్నాయ్.

ఇక మరో నాటిక

## సమాంతర రేఖలు

ఇదొక మానసిక సంఘర్షణల చిత్రీకరణ, జ్ఞాపకాల సంకేతం. విషాద సంగీతం.

ప్రతి మనిషి జీవితం లోనూ కొన్ని సంఘటనలూ, స్మృతులూ జీవితాంతం తమ ప్రభావాన్ని చూపుతూ, ఒక శాశ్వత స్థానాన్ని సంపాదించుకుంటాయ్. ఇవే ప్రేమానుభూతులయితే ఇక చెప్పవలసిన పనే లేదు. గతం తాలూకు తీపిగుర్తుల్ని మోసుకొస్తూ నిరంతరం మానసిక సంక్షోభాన్నీ, ఆవేదన్నీ, ఆనందాన్నీ– ఇలా ఎన్నో అనుభూతుల మరకల్ని మెదడు మీద లిఖిస్తుంటాయ్, లోతుగా పరిశీలిస్తే దాదాపు ప్రతివ్యక్తి జీవితం ఒక మధురకావ్యం అవుతుంది, శిల్పి చేతిలో పడితే. ప్రతివ్యక్తి అనుభవాలు మధుర సంకేతాలవుతాయ్ హీరాలాల్ వంటి రచయితల సృష్టిలో జీవం పోసుకుంటే.

నిజమే. సంఘంలో చాలా రకాల వ్యక్తుల్ని. చాలా రకాల వ్యక్తిత్వాల్ని, చూస్తుంటాం. ఎవరికివారే ఒక్కో మోడల్ కింద కనబడుతుంటారు. ఒక స్త్రీ జీవితంలో ఎప్పుడో ఎవ్వరో తటస్థపడ్డారనే అనుకుందాం. తద్వారా ఏర్పడ్డ స్నేహం, సినిమాలూ, షికార్లు, వీల్లైతే

డ్యూయెట్లు పాడుకున్న తర్వాత ఏకారణాల వల్లనైతేనేమి వారు విడిపోవటం, ఆమెకు ఇంకో వ్యక్తితో పెళ్ళి కావడం కూడా జరిగిపోతే ఇక గత్యంతరం లేని పరిస్థితుల్లో ఆమె తన భర్తతో రాజీపడి జీవించడమో, లేదా తన అయిష్టతనీ, అసహాయతల్నీ వ్యక్తపరిచి, విడిపోయైనా బ్రతకడమో శ్రేయస్కరం. కానీ అటు అడ్జస్ట్ కాలేక, ఇటు విడిపోక — కట్టుకున్న భర్తతో కాపురం చేస్తూనే, అతను సమకూర్చే సౌకర్యాలనూ, సౌఖ్యాలనూ దర్జాగా అనుభవిస్తూనే — ఏదో కొంప లంటుకు పోయినట్టు విచారిస్తూ, వీలైతే ఆ పాత ప్రియుడ్ని కలవటానికి ప్రయత్నిస్తూ, ఇంకా వీలైతే అతనితో చెట్టాపట్టా లేసుకుని తిరుగుతూ — అటు ఆపాత ప్రియుడిని సంపూర్ణంగా సంతృప్తిపరచలేక, ఇటు భర్తనీ ఆనందింపజేయలేక, మధ్య తనూ నిశ్చింతగా సుఖించలేక సతమతమయ్యే నమూనాల వంటి స్త్రీలను ఈ సంఘంలో అక్కడక్కడా చూస్తూనే ఉంటాం మనం. ఈ అంశాన్నే చక్కని పాత్రల్ని సృష్టించి, ఉచితమైన సంభాషణల్ని కూర్చి ఈ 'సమాంతర రేఖలు' నాటికలో రూపకల్పనచేశారీ సాహిత్య స్రష్ట. నిజంగానే ఈ నాటికలోని నాయికానాయకులైన శకుంతలా, డాక్టర్ గోపాల్‌ల ఆలోచనలూ, ఊహలూ, అభిరుచులూ, చివరికి జీవితాలూ సమాంతర రేఖలే సుదీర్ఘమైన రైలు పట్టాలకి మల్లే, గంగా యమునలకు మల్లే, అవి ఎప్పుడూ కలవలేవు. ఒక స్పష్టమైన సరిహద్దు ఆ రెండు రేఖలకి మధ్య ఉంటూనే ఉంటుంది.

"నేనొక వియోగ గీతికను
నా నివాసమ్ము తొలుత గాంధర్వ లోకం
మధుర సుషుమా సుధాగాన మంజువాటి
నేనొక రేయి వెడలి పోతి''

అటుం ఏకాంతంగా ఉన్నప్పుడు వియోగ గీతికల్ని ఆలాపిస్తూంటుంది శకుంతల. ఇట్లాంటి వారు జీవితంలో తామూ సుఖపడలేరు. తమ చుట్టూ ఉన్నవారినీ సుఖపడనీయలేరు.

శకుంతల తన ఉద్రేకానికి బలైన ఫ్లవర్ వేజ్‌ని చూస్తూ "గాజు పలిగిపోతే మళ్ళీ అతకడం సాధ్యమవుతుందా డాక్టర్?!'' అడుగుతుంది భర్తని.

"ప్రతి చిన్న విషయాన్నీ సీరియస్‌గా తీసుకుని బాధపడ్డం అంత మంచిదికాదు శకూ. దానివలన ఆరోగ్యం పాడై పోతుంది. ఫ్లవర్ వేజ్ పోతే పోనీ, ఇంకోటి కొందాం. అరే గులాబీలా. ఇవి ఎవరు తెచ్చారు నీగదిలోకి. ఇప్పుడు తెలిసింది సంగతేమిటో. ఇవీ మల్లి తెచ్చి ఉంటుంది. కొత్తగా వచ్చింది, పాపం దానికిదేం తెలియదు. గులాబీలంటే నాకు విపరీతమైన ప్రేమ. నీకు అపరిమితమైన ద్వేషం ఈ విషయంలో మనిద్దరివీ ఉత్తర దక్షిణ ధృవాలు. జ్యోతులు జ్యోతులుగా పూస్తాయ్ కదూ శకూ. ఇవి మరీ ఈ ఎర్ర గులాబీలు. అచ్చం నీ పెదవుల్లాగే. వీటినలా స్పృశిస్తే. నిన్ను స్పృశించిన అనుభూతి కలుగుతుంది. గుత్తులు గుత్తులుగా పూచిన ఈ రాగజ్యోతులు కనిపిస్తే, ఈ ప్రపంచాన్నే మరిచిపోయి. అలా చూస్తూ ఉండి పోవాలనిపిస్తుంది నాకు. ఇవంటే నీకింత ద్వేషం దేనికి శకూ ?!'' అని ప్రశ్నిస్తాడు.

"ఈ పూవులు కొందరిని మరిపిస్తాయి. కానీ కొందరిని జ్ఞాపకం చేస్తాయ్ డాక్టర్! అచ్చం రక్తం కక్కుకున్న గాయంలా ఉంటాయివి.'' అని సమాధానం చెబుతుంది శకుంతల.

ఇదిగో ఇలా సాగుతూ ఉంటుంది, వీరిరువురి ఆలోచనా స్రవంతి. ఈ రేఖలు చివరిదాకా కలవ్వు ఎవరి దారి వారిది. ఎవరి భావాలు వారివి. ఎవరి అనుభూతులు వారివి. ఎవరి అనుభవాలు వారివి ఈ విభిన్న మానసిక ప్రవృత్తుల చిత్రీకరణమే ఈ నాటిక విభిన్న పాత్రల సజీవ చైతన్యమే ఈ గల్పిక.

ఇలా సాహిత్యాల్ని కాలక్షేపం కోసమో, వంటయింటి కబుర్లు చెప్పడం కోసమో, ఆరడుగుల పడంగుశముల హీరోలను ఊహిస్తూ, స్వాప్నిక జగత్తులో పరిభ్రమింప చేయడం కోసమో కాక సామాజిక ప్రయోజనాన్ని కాంక్షిస్తూ, వాస్తవిక సంఘటనలకు రూపకల్పన చేస్తూ, సమస్యల పరిష్కారాన్ని సూచిస్తూ మానవతా దృక్పథంతో సాహిత్యాన్ని ఒక సెకండరీ ఆబ్జెక్టు గానో, డబ్బు జేసిపెట్టే వ్యాపార సాధనంగానో కాక ఒక దీక్షగా, ఒక నిరంతర తపస్సుగా కృషి చేస్తున్న ఈ రచయిత హీరాలాల్ మోరియా యువ రచయితలకు ఒక మార్గదర్శకుడు. వచనసాహిత్యంలో ఒక మరుపురాని మనీషి. ఒక కావ్యద్రష్ట. ఉత్తమ కళాస్రష్ట.

—ఎస్వీ




## కాలవాహిని

రచన—బెజవాడ గోపాలరెడ్డి

వెల: రూ. 6-00

ప్రతులకు-ఆంధ్ర సారస్వత పరిషత్తు,
తిలక్‌రోడ్, హైద్రాబాదు-500001.

శ్రీ గోపాలరెడ్డి గొప్ప భావుకులు. నూనూగు మీసాల నూత్న యౌవనంలో శాంతినికేతనంలో రవీంద్రుని అంతేవాసిగ వున్నవారు. అందువల్ల రవి కవి కవితా ప్రభావం వారి హృదయంలో ఆనాడు ముద్రింపబడి, గుప్తంగా, సుప్తంగావుండి ఈనాడు అనగా 1977లో ప్రకటితం కావడం ఆనందదాయకం. గోపాలరెడ్డిగారు ఇంతవరకు అనువాద రచనలే చేస్తూ వచ్చారుగాని సృజనాత్మక రచనలు చేసినట్లు కన బడదు. నేటికి ప్రాయము కైవాలినవేళ సృజనాత్మక మైన రచనకు పూనుకొని చక్కని రచనలు చేస్తున్నందుకు గోపాలరెడ్డిగారిని అభినందించక తప్పదు.

1977 నుండి 79 వరకు తాము వ్రాసిన వివిధ కవితా ఖండికలను ఏర్చి కూర్చి శ్రీ గోపాలరెడ్డి ఈ సంపుటిని ప్రచురించారు. 'కాలము' 'నేడు' 'కాలపు ఆత్మకథ' 'నిన్నలు' అనే శీర్షికలు కాలానికి సంబం ధించినవిగా వుండడం వల్ల ఈ కవితాసంపుటికి "కాల వాహిని" అనే పేరు సముచితంగా వుంది.

గోపాలరెడ్డిగారి భావుకతకూ, రసికతకూ ఈ క్రింది పంక్తులు ఉదాహరణలుగా నిలుస్తాయి. ఇది తాజ్‌మహల్ వర్ణన.

"గతించిన కాల కాలుష్యాన్ని
పారద్రోలే మల్లెల పెనుకొండ
దిగంతాల ఒంటిమీద
పూసిన తెల్ల చందనం
ఆకాశపు చంద్రవదన
తన అందాలకు మురిసే
భూలోకపు మణి దర్పణం"

లాగా వుందట తాజ్‌మహల్. ఎంత రమణీయ వర్ణన?

'ద్వాపరమున వెన్నముద్దలు ప్రుచ్చిలించి ఋణ పడిన గోపాలుడు, పశ్చాత్తాపపడి వ్రజ యువతులకు తిరిగి ఇచ్చిన కలియుగ నవనీత గిరిరాజం' అట తాజ్‌మహల్. ఇంకా ఎన్నో మనోహర భావాలను పొదుపుకున్న కమనీయ కవిత తాజ్‌మహల్.

'నేడు' కవిత ఎంతో భావ బంధురంగా వుంది.

"చీకటి కొండల రెంటి నడుమ
జాలువారు సన్నని వెలుగువాగు నేడు"
"గడచిన కాలపు కోట్ల నిన్నలను
రాబోవు కాలపు కోట్ల రేపులను
తగిలించే వెండి కొలికి నేడు"

'నిన్నలు రేపులకు అందిచ్చే లేఖ నేడు' అట. 'నేడు' కవిత ఒక వాడిపోని పరిమళ భరిత పుష్ప గుచ్ఛం. 'నిన్న' కూడా సురుచిర కవితా రూపంతో దర్శన మిస్తుంది. 'మనము అనుభవించిన ఆనంద విషాదాలు నిన్నలో చేరి స్మృతులై యున్నాయి' అంటూ 'నిన్న' ను వన్నెచిన్నెలతో వర్ణించారు కవి.

ఈ సంపుటిలో కవి భావానా శక్తికి పతాకలుగా నిలిచే పంక్తులెన్నో కనిపిస్తాయి.

"కొమ్మలు వీధులుకాగా
చెట్టు ఊరుగా ఉండేది పిట్టలకు
సంజవేళ లేత చీకట్ల పిలుపులు విని
పిట్టలన్నీ గుమికూడేవి"
(మాఊరి రావిచెట్టు)

"మా ఊరి మరణ దేవతకు
రాజచ్ఛత్రమిది"
(మాఊరి రావిచెట్టు)

"అశరీరవాణీ సంభరితమై
నా గదిలోని నీరవత
మూగగ రేడియోను కౌగిలించుకొని
రాత్రంతా మేల్కొనే వుండింది"
(రేడియో)

కమ్మని కాలపు కవితామృతాన్ని ఆస్వాదిస్తూ, అందమైన ముఖచిత్రాన్నీ ముద్రణను చూచి ఆనం దించ దగిన మంచి కవితా సంపుటి ఇది.

## కిరణాలు - కెరటాలు

రచన - తిరుమల శ్రీనివాసాచార్యులు
వెల: రూ. 2-00
ప్రచురణ-యువభారతి. 5, కింగ్స్‌వే
సికింద్రాబాదు-500003

నీతినీ, సమాజరీతినీ, ప్రబోధాన్నీ, కవితా గంధంతో మేళవించి ప్రకటించిన కవితా ముక్తక సంపుటి ఇది. కిరణాల్లాంటి ఆలోచనలకూ, కెరటా ల్లాంటి అనుభూతులకూ అక్షరాకృతులే ఈ ముక్తకాలు. అంత్యప్రాసలవంటి శబ్దచమత్కారాలే కాక భావప్రాభ వాన్ని కూడా ప్రకాశింప జేశారు శ్రీనివాసాచార్యులు గారు. లోకం పోకడను కవి చక్కగా పరిశీలించారన డానకి ఎన్నో ముక్తకాలు ఉదాహరణాలుగా నిలు స్తాయి.

"ఇంకు ఏదైతేనేం
అంకెలు వేయడానికి
మనిషి ఎవడైతేనేం
మంచిని చేయడానికి"

"ఎప్పుడూ ప్రపంచంలో
ఎక్కడో ఒక చోట
మల్లెలు పూస్తూంటాయి
మంటలు లేస్తుంటాయి"

కవి ప్రతిభా వైభవాన్ని చాటే ఈ క్రింది పంక్తు లను గమనించండి.

"తరువుకున్న ఆకులన్నీ
కిరణాలను తిలకించవు
అవకాశాలున్నవి ఇల
అందరినీ పలికించవు"

"సామాన్యుని రెక్కలతో
సంపన్నుని మేడ లేచు
పేదరైతు నాగలితో
పెన్నిధులే పూచు"

అల్పాక్షరములలో అనల్పార్థం కనబడుతుంది ఈ ముక్తకాల్లో.

"లోచనం కన్నా
ఆలోచనం ప్రధానం"

"శక్తి పెంచుకున్ననాడే
సంఘం నిను పిలుస్తుంది"

"సోమరితనాన్ని తొక్కేవాడే
సోపానా లెక్కేవాడు"

"పల్లెలు పచ్చగా ఉంటెనే
ఢిల్లీ గొప్పతనం"

"కలిసి ఉంటెనే జనం
కలిపి తింటేనే భోజనం"

ఇవి ఎంత మంచి సూక్తులు? ఈలాంటి ముక్తక మౌక్తికాలను గుండె పెట్టెలో దాచుకోవాలి పాఠకులు. ఉదాహరించడానికి ప్రతిముక్తకమూ యోగ్యమైందే. పుస్తకం కొని చదువ వలసినదిగా సహృదయులను కోరుతున్నాను.

—వేముగంటి

## వార్తావాహిని

# హిందీ మహావిద్యాలయం, విజయవాడ సత్రాంతోత్సవము

విజయవాడలో దక్షిణ భారత హిందీ ప్రచార సభ వారి ఆధ్వర్యమున నడుపబడుచున్న హిందీ మహావిద్యాలయము సత్రాంతోత్సవము 28-8-1980 తేది మధ్యాహ్నము మాచవరంలోని ప్రచారక ట్రైనింగ్ స్కూలు భవనమునందు ఉత్సాహపూరిత వాతావరణంలో జరుపబడినది.

అల్పాహారవిందు అనంతరము మధ్యాహ్నము 3 గంటలకు సభా కార్యక్రమమునకు ఆహూతులైన పెద్దలకు మహా విద్యాలయం ప్రిన్సిపాల్ కాజ వెంకటేశ్వరరావుగారు స్వాగతం పలికి పుష్పమాలాలంకృతులను గావించిరి. సభకు దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఆంధ్ర కార్యదర్శి గౌ॥ శ్రీ చిర్రావూరి సుబ్రహ్మణ్యంగారు అధ్యక్షత వహించిరి. ప్రచారక్ విద్యాలయం ప్రిన్సిపాల్ గౌ॥ యం. సుబ్బారావుగారు ముఖ్య అతిధులుగా వుండిరి. కుమారి శారద ప్రార్థనా గీతముతో సభ ప్రారంభమైనది.

ముఖ్య అతిథి శ్రీ సుబ్బారావుగారు మాట్లాడుతూ- దేశ సమైక్యతకు ప్రధాన సాధనము భావ సమైక్యత, భావసమైక్యతకు ప్రధాన ఆధారము హిందీ భాషా ప్రచారము, అను సత్యమును గ్రహించి స్వాతంత్ర్యమునకు పూర్వము నుంచికూడ దక్షిణ భారత హిందీ ప్రచార సభ దక్షిణ దేశమంతటా హిందీ భాషా ప్రచారము చేయుచున్నది. స్వాతంత్ర్యానంతరము కూడ ప్రజలలో సమైక్యతా భావమును పటిష్ఠ మొనర్చి సాంస్కృతిక ఐక్యతను సాధించు లక్ష్యముతో అనేక రూపములలో సభ వారు పని చేయుచున్నారు. అందులో ఒక భాగంగానే విద్యాలయములు నడుపబడు చున్నవి. ఇందును సభవారిని మన మందరము అభినందించ వలయును.

విజయవాడలో విద్యార్థినీ విద్యార్థులు అధికముగా హిందీ నభ్యసించుటకూడ సంతోషించదగిన విషయమని చెప్పిరి.

శ్రీ తంగిరాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, శాఖా కార్యాలయం మేనేజరు పి. ప్రసాదరావుగారు విద్యార్థి విద్యార్థినులు అలవరచు కొనవలసిన క్రమశిక్షణ, పరీక్షా విధానములను గురించి పేర్కొనిరి. భూతపూర్వ ఆర్గనైజరు శ్రీ నండూరి శోభనాద్రాచార్యులు గారు విద్యాభ్యాసము అందునా ప్రత్యేకంగా హిందీ అభ్యాసము చేయువారి నడవడి వినయము సేవా భావములను గురించి వివరించిరి. రాజకీయములకు అతీతంగా, పవిత్రలక్ష్యముతో హిందీ భాషా ప్రచారము కొనసాగు చున్నదని కూడా పేర్కొనిరి. మహా విద్యాలయం విద్యార్థి అన్వర్‌జాని విద్యాలయం బోధనా విధానం బాగున్నదంటూ ఉపాధ్యాయుల బోధనా విధానమును ప్రశంసిస్తూ మాట్లాడిరి

అనంతరము సభాధ్యక్షులు మాట్లాడుచూ- దక్షిణ భారత హిందీ ప్రచార సభ లోగడ సాహిత్య ప్రచా

రమునకే ప్రాధాన్యతనిస్తూ ప్రచారము కొనసాగించి నది. కాని స్వతంత్ర భారతంలో పరిస్థితుల కనుకూలంగా మరొక పద్ధతికూడ అవలంబించి అన్నిరకములైన ఆఫీసులందు పని చేయుటకు తగిన సామర్థ్యమున్న వారిని తయారు చేయుటకుగాను అవసరమైన శాస్త్రీయ పదజాలముతో కూడిన వున్నత కోర్సులు కూడ చేపట్టి తగిన కృషి సభ చేయు చున్నదనిరి. ప్రయివేటు ప్రచారకుల ద్వారాను, విద్యాలయముల ద్వారాను కొనసాగుచున్న కృషి సంతోషకరంగా వున్నదనిరి. ఆగస్టు పరీక్షలకు మొత్తం దక్షిణ దేశములో హాజరగు విద్యార్థుల సంఖ్య 80,000 కాగా అందు ఒక ఆంధ్రప్రదేశ్ నుంచి హాజరయ్యేవారి సంఖ్య 45 వేలుగా వున్నదని, దీనిని బట్టి హిందీ భాషా ప్రచార రంగమందు ఆంధ్ర అగ్రగామిగానున్న దని చెప్పుటకు చాలా సంతోషంగా వున్నదంటూ విజయవాడ విద్యాలయములో అభ్యసిస్తున్న విద్యార్థినీ విద్యార్థులందరికి తమ శుభాశీస్సులు తెల్పిరి.

తరువాత సభా కార్యక్రమము జయప్రదం గావించిన పెద్దలందరికి ప్రిన్స్‌పాల్ కాజ వెంకటేశ్వర రావుగారు అభినందనలు తెలియ జేసిరి. ఫోటో ఏర్పాటు అనంతరం సభ ముగిసినది.

## హిందీ ప్రమాణపత్ర వితరణోత్సవము

### వచ్చలతాడిపర్రు

డి. 22-8-80 శుక్రవారం సాయంత్రము గం॥ 4.30 లకు పచ్చలతాడిపర్రు జిల్లాపరిషత్తు హైస్కూలులో సదరుస్కూలు ప్రధానోపాధ్యాయులు శ్రీ బి. హెచ్. సోమశేఖరరావుగారి అధ్యక్షతన జరుపబడినది. అధ్యక్షులవారు తమ ఉపన్యాసములో సత్ప్రవర్తన. సత్శీలమునలవర్చుకొని ఉత్తమ భావి పౌరులుగా తమ జీవితమును తీర్చిదిద్దుకోనవలసినదిగా విద్యార్థులను కోరిరి. 1980 ఫిబ్రవరిలో పరిచయ, ప్రాథమిక, మధ్యమ, రాష్ట్రభాష పరీక్షలలో ఉత్తీర్ణులయిన 62 మంది విద్యార్థులకు వెల్లలూరు గ్రామ సర్పంచ్ శ్రీ బండి వెంకటేశ్వర్లుగారు ప్రమాణ పత్ర ప్రదానము చేసిరి. వారు తమ ఉపన్యాసములో గ్రామ ప్రాంతమైన పచ్చలతాడిపర్రులో హిందీ ప్రచారము చేయుచున్న స్థానిక సీనియరు హిందీ పండితుడు కే. సీతారామయ్యగారు చేయుచున్న హిందీ సేవను ప్రశంసించిరి. తెలుగుతోబాటు హిందీ భాషలో కూడ కవులు పండితులు ఉద్భవించవలసినదిగా కోరిరి. విద్యయే అన్నిటికి మూలమని దానిని అభ్యసించుటలో అలక్ష్యము చేయరాదని విద్యార్థులను కోరిరి. హిందీ ప్రచారకుడు కే. సీతారామయ్య తన నివేదికలో కేంద్రపరిచయముతో బాటు దక్షిణ భారత హిందీ ప్రచార సభయొక్క పరిచయమును, హిందీ ప్రచారమును వివరించుచూ గ్రామప్రాంతములలో హిందీ ప్రచారము యొక్క ఆవశ్యకతను తెలియ జేయుచూ అందరి సహకారమునూ కోరిరి. వందన సమర్పణ జేసిరి. జాతీయ గీతముతో సభ సమాప్తి చెందినది.

## స్వతంత్ర సమావేశం-పామిడి

తేది 21-8-80న ప్రభుత్వ జూనియర్ కళాశాల, పామిడి ఆవరణమందు స్వతంత్ర సమారోహ జరుపబడినది.

శ్రీ సరస్వతి పూజానంతరము హిందీ ప్రచారకులు శ్రీ ఏ. బి. ఉమాశంకర్‌గారు అతిథులకు స్వాగతము పలుకుచూ, గత ఫిబ్రవరి పరీక్షలలో విద్యార్థులు సాధించిన ప్రగతిని గూర్చి వివరించుచూ, హిందీ భాషపట్ల విద్యార్థులు ప్రదర్శించుచున్న శ్రద్ధాసక్తులను ప్రశంసించిరి.

సభకు అధ్యక్షత వహించిన, ఇన్‌చార్జ్ ప్రిన్సిపాల్ గారైన శ్రీ ధనుంజయచెట్టిగారు విద్యార్థులను ఆశీర్వదించుచూ హిందీ పరీక్షలపట్ల, హిందీ భాషపట్ల శ్రద్ధ

చూపవలెనని తద్వారా జాతి శ్రేయస్సునకు దోహద మొసంగవలెనని ఉపన్యసించిరి.

హిందీ లెక్చరర్‌గారైన శ్రీ బి. సుబ్బరాయుడు గారు మాట్లాడుచూ హిందీ భాషపట్ల తప్పక ప్రేమ, శ్రద్ధ, అభిరుచిని చూపుచు, నేర్చుకొనవలెనని, జాతీయ సమైక్యతకు తోడ్పడవలెనని మాట్లడిరి.

శ్రీ పి. అల్లాబాకష్ (హిందీ ప్రచారకులు) వందన సమర్పణ గావించిరి.

## తణుకులో హిందీ పునరుద్ధరణ

ఆగష్టు 15న తణుకు హిందీ పండిట్ సహాయక ప్రచారక్ శ్రీమతి మెట్టా సీతామహాలక్ష్మిగారి ప్రోత్సాహముతో హిందీ ప్రేమీ మండలి పునరుద్ధరణ జరిగినది. మండలి అధ్యక్షులుగా, యన్. సుభద్రమ్మ బి ఎస్.సి. బి ఇ.డి. ఆర్.బి. విశారద, ఉపాధ్యక్షులు 1. మెట్టా సీతామహాలక్ష్మి విద్వాన్, సహాయక ప్రచారక్, 2 ఓగిరాల జయలక్ష్మి బి.ఎ. బి.ఇ.డి. సెక్రటరీగా మెట్టా సుబ్బారావు, అసిస్టెంట్‌గా కె. కృష్ణారావు, కోశాధ్యక్షులుగా కె. ఎస్. ఎస్ ప్రకాశరావులు నియమితులైరి.

ఆగష్టు 15, స్వాతంత్ర్య దినోత్సవ సమయమున తణుకు బాలికోన్నత పాఠశాలలో ప్రమాణపత్ర వితరణోత్సవ సభ జరిగినది. సభకు పాఠశాల ప్రధానోపాధ్యాయిని శ్రీమతి బి. శేషారత్నంగారు అధ్యక్షత వహించిరి. వందేమాతరం ప్రార్థనా గీతముతో సభ ప్రారంభమై, 1980 ఫిబ్రవరిలో ఉత్తీర్ణులైన వారికి ప్రమాణ పత్రములు, ఎక్కువ మార్కులు వచ్చిన వారికి బహుమతులు శ్రీమతి శేషారత్నంగారిచే యిప్పించిరి. నేటి హిందీ ఆవశ్యకతను గూర్చి యన్. సుభద్రమ్మగారు, ఓగిరాల జయలక్ష్మిగారు, మెట్టా సీతామహాలక్ష్మిగార్లు ప్రసంగించిరి. అధ్యక్షుల వారి సందేశములో హిందీ ప్రచారక్‌లు మెట్టా సీతామహాలక్ష్మిగారి హిందీ ప్రచారము ను కొనియాడిరి. మండలి వారిచే పిల్లలకు మిఠాయిలు పంచి పాఠశాల వర్కింగ్ స్టాఫ్‌కు అల్పాహార తేనేటి విందు జరిగినది. జనగణమనతో సభ ముగిసినది.

## హిందీ సాహిత్య పరిషత్, మచిలీపట్టణము

ది 17-8-1980న సాయంత్రము 5 గం॥లకు మచిలీపట్నం హిందీ సాహిత్య పరిషత్ ఆధ్వర్యమున ప్రసిద్ధ హిందీ రచయిత ప్రేమ్‌చంద్ శతజయింతి ఉత్సవ సభ డా॥ యమ్. రామలింగేశ్వరరావుగారి అధ్యక్షతన లైన్స్‌క్లబ్ జూబ్లీహాలులో వైభవముగా జరిగినది.

అధ్యక్షులు మాట్లాడుచూ, ప్రేమ్‌చంద్ నిరుపేద కుటుంబములో జన్మించిరనియు, వారు వివిధ సాహిత్య ప్రక్రియల ద్వారా విభిన్న వర్గాలకు చెందిన ప్రజల పరిస్థితులను విశదీకరించి, ఆదర్శమార్గమున వాటి పరిష్కారముకూడా సూచించిరనియు, ఆదర్శోన్ముఖ యధార్థవాదిగా వారు ప్రసిద్ధిచెందిరనియు వారి సాహిత్యము శాశ్వత విశ్వసాహిత్యమునకు చెందినదనియు చెప్పిరి. ప్రధానవక్త శ్రీ తేజ్‌బహాదుర్‌సింగ్ గౌతమ్ మాట్లాడుచూ ముందు సోషలిజము దాని లక్ష్యములను వివరించి, సంఘములో వాస్తవమైన సోషలిజమును స్థాపించుటయే ప్రేమ్‌చంద్ రచనల లక్ష్యమనివక్కాణించిరి. వరకట్నం, కలవని పెండ్లి, పరంపరాగతమైన అంధవిశ్వాసములు, ఆర్థిక సంఘర్షణకు సంబంధించిన సమస్యలు, మొదలైన సాంఘిక, ఆర్థిక సమస్యలకు సంబంధించిన వాస్తవమైన మానవ జీవిత చిత్రాన్ని ఎంతో నైపుణ్యంతో చిత్రించిరని చెప్పిరి. భారతీ హిందీ మహా విద్యాలయ విద్యార్థులు శ్రీ తుమ్మలపల్లి రామానందప్రసాదు,

కు॥ పెదప్రోలు మాధవీలత - ప్రేమ్‌చంద్ జీవిత, సాహిత్య విశేషము లను హిందీలో వివరించిరి.

తొలుత భారతీ హిందీ మహా విద్యాలయ కార్యదర్శి శ్రీ చలమలశెట్టి శేషగిరిరావు అధ్యక్షులను, వక్తను సభకు పరిచయముచేసి సభికులకు స్వాగతం చెప్పిరి. కు॥ వి. సావిత్రిగారి అభినందనలతో సభ ముగిసినది.

## హిందీ ప్రేమీమండలి, రాజమండ్రి

17-8-80 ఆదివారము సా॥6 గం.లకు రాజమండ్రి హిందీ ప్రేమీమండలి (విక్రమహాలు) కార్యాలయంలో హిందీ ప్రమాణపత్ర వితరణోత్సవము ప్రేమీమండలి అధ్యక్షులు డా. మండవిల్లి మల్లికార్జునరావు అధ్యక్షతన ఘనముగా జరిగినది. శ్రీ శేర్ మురళీధర్ రామకుమార్ ముఖ్య అతిధిగా పాల్గొని విద్యార్థులందరికి ప్రమాణ పత్రములు అందచేసిరి. ప్రేమీమండలి ఉపాధ్యక్షులు శ్రీమతి దాట్ల సత్యవతిరాజు సభా ప్రారంభము చేసారు.

శ్రీ మురళీధర్ రామకుమార్ మాట్లాడుచూ "ఈనాటి పాఠ్యప్రణాళికలు కంటే, పూర్వ పాఠ్య ప్రణాళికలే విశిష్టముగా వుండేవని, పాఠ్యగ్రంధములలో నైతిక విలువలతో మహాత్ముల చరిత్రలు ఇతిహాసములు అవసరమని, యిందుకు దక్షిణ భారత హిందీ ప్రచార సభ విశేష కృషి చేయుచున్నదని అంటూ, రాజమండ్రి హిందీ ప్రేమీమండలి ఈ సంవత్సరము హిందీ టైపు విద్యాలయము తెరచినందుకు, హర్షము వ్యక్తపరస్తూ. దీనిని యింకా అభివృద్ధిపరచాలని, అందుకు తన ఆర్థిక సహకారము అందము చేయగలనని వాగ్దానము చేసిరి.

హిందీ ప్రేమీమండలి అధ్యక్షులు డా. మండవిల్లి మల్లికార్జునరావు. "హిందీ ప్రేమీమంతలి వార్రి కృషికి అందరూ సహకరించాలని కోరుచూ ఈ సంవత్సరము నెలకొల్పిన టంకణ విద్యాలయ అభివృద్ధికి సహాయపడాలనిరి ప్రార్థించిరి

మండలి కార్యదర్శి శ్రీ చేబోలు శేషగిరిరావు తన కార్యదర్శి నివేదికలో ప్రేమీమండలి, హిందీ విద్యాలయముల విద్యార్థుల సంఖ్య పెరుగుదల, ప్రగతి గురించి వివరించిరి-

ఉపాధ్యక్షులు శ్రీమతి దాట్ల సత్యవతిరాజు "హిందీ ప్రేమిమండలి హిందీ విద్యాలయములు నడుపుటయే కాకుండా, వివిధ సాంస్కృతిక, కార్యక్రమములు, నాటికలు, పుస్తక ప్రదర్శనలు, విద్యార్థులలో వివిధ పోటీ పరీక్షలు నడిపించి, ఉన్నత విద్యాసాంప్రదాయములను నిలబెట్టుకొనుచున్న దని" ఉద్ఘాటించిరి.

డా॥ గొర్తి సీతారామయ్య "దేశములో హిందీ ప్రచారము మరింత అవసరమని, ప్రేమానురాగములతోనే ప్రచార-ప్రసారములను జరగాలని, విద్యార్థులంతా వ్యాకరణము కష్టపడి నేర్చుకొని పండితులగుటకు కృషి చేయాలని" ఆశీర్వదించిరి.

శ్రీ తాడూరి కృష్ణారావు (అడ్వకేట్) "అన్ని భాషలకు మూలము సంస్కృతమని, సంస్కృత శబ్దములు అన్ని ప్రాంతీయ భాషలను కలుపుచూ వున్నదని, హిందీ సంస్కృత శబ్దములలో పరిపూర్ణమై యున్నదని," అంటూ రాజమండ్రిలో హిందీ మాతృభాష కలిగిన సంపన్నులు హిందీ ప్రేమీమండలికి తోడ్పడాలని కోరిరి-

పిమ్మట శ్రీ మెరపల సన్యాసిరావు (ద. భా. హిందీ ప్రచార సభ ఆంధ్ర (కార్యవర్గ సభ్యులు) "హిందీ ప్రేమీ మండలి-కార్యవర్గం వారి కృషివలన, ఉపాధ్యాయ వర్గం కృషివలన ఎన్నో సాహిత్య కార్యక్రమములు, నిర్వహించామని, దీనికి తోడ్పడిన సభ్యులందరికి ధన్యవాదములు తెలిపిరి-

శ్రీయుతులు ముళ్ళపూడి సూర్యనారాయణమూర్తి చేబోలు శేషగిరిరావు హిందీ వ్యాప్తి గురించి మాట్లాడిరి.

ప్రిన్సిపాల్ శ్రీ టి. వి. జగన్నాధాచార్యులు వందన సమర్పణ చేసిరి-

## గాంధీ పర్వత సంస్థ, విజయవాడ భారత స్వాతంత్ర్య దినోత్సవ కార్యక్రమము

భారత స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంలో 15-8-1980వ తేదీన గాంధీ పర్వతం మీద ఉదయం 8.30 నిమిషములకు గాంధీ పర్వత సంస్థ ఉపాధ్యక్షులు, స్వాతంత్ర్య సమరయోధులు డా. పి. వి. సుబ్బారావుగారు జాతీయ పతాకావిష్కరణ చేసారు. గాంధీ పర్వత సంస్థ ఆధ్వర్యంలో నడుపబడుచున్న హిందీ మహా విద్యాలయ విద్యార్థినీ - విద్యార్థులు, అధ్యాపక బృందము ఇతర ప్రముఖులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. డా.పి.వి. సుబ్బారావుగారు స్వాతంత్ర్య సమరం నాటి వీరగాధలను స్మరణకు తెచ్చి నేటి యువతరం గూడ అటువంటి దేశభక్తిని, ఉత్సాహాన్ని పెంపొందిచుకోవాలని ఉద్బోధించారు. శ్రీ మావులేటి సత్యనారాయణ రాజుగారు (ప్రముఖ ప్రకృతి వైద్య ప్రచారకులు) మన స్వరాజ్యం సురాజ్యం కావాలని గాంధీజీ ఆశించారని అందుకోసం భావితరం వారు నడుము కట్టాలని ప్రబోధించారు, హిందీ మహా విద్యాలయ ప్రధాన అధ్యాపకులు శ్రీ చర్ల జనార్దనస్వామిగారు జాతీయ పతాక వందన కార్యక్రమం నిర్వహించారు.

సాయంకాలం 5 30 నిమిషములకు గాంధీ పర్వత సంస్థ కార్యలయ భవనంలో డా. పి. వి. సుబ్బారావు గారి అధ్యక్షతన బహిరంగ సభ కార్యక్రమం జరిగింది. మానవోత్థాన సేవాసమితి ప్రచారకులు స్వామి ముసాఫిరానంద్‌గారు, గాంధీ పర్వత సంస్థ సహాయ కార్యదర్శి శ్రీ ఐ.ఎస్.ఆర్. మూర్తిగారు మహాత్ముడు కలలుగన్న రామరాజ్యంగా భారతదేశాన్ని తీర్చి దిద్దడానికి, విశ్వప్రేమను, మతసామరస్యాన్ని పెంపొందించు కోడానికి నేటి భారత పౌరులు గట్టి కృషిచేయాలని ప్రబోధించారు గాంధీ పర్వత హిందీ మహా విద్యాలయంలో చదివి ద భా హిందీ ప్రచార సభ వారి 1980 ఫిబ్రవరిలో జరిగిన ప్రాథమిక, మధ్యమ, రాష్ట్రభాష పరీక్షలలో ఉత్తీర్ణులయిన విద్యార్థినీ విద్యార్థులకు, కేంద్రీయ గాంధీ స్మారకనిధి. వార్ధ, వారి 1980 మార్చిలో జరిగిన ప్రారంభిక, ప్రవేశ, పరీక్షలలో ఉత్తీర్ణులయిన వారికి యోగ్యతా పత్రములు, స్వాతంత్ర్య దినోత్సవ సందర్భములో నిర్వహించబడిన ఉపన్యాస పోటీలలో గెలుపొందిన వారికి బహుమతులు డా. పి.వి. సుబ్బారావుగారు ఇచ్చినారు. పోటీలలో గెలుపొందిన విద్యార్థినీ విద్యార్థులు హిందీలో ఉపన్యసించినారు. అధ్యక్షులు తమ అధ్యక్షోపన్యాసంలో విద్యార్థులకు క్రమశిక్షణ, అవశ్యకతను గురించి, గాంధీజీ ఆశయాలను అర్థం చేసుకొని అనుసరించవలసిన అవసరాన్ని గురించి ప్రబోధించారు. హిందీ మహా విద్యాలయ ప్రధాన అధ్యాపకులు శ్రీ చర్ల జనార్దనస్వామిగారు అతిథులకు స్వాగతం చెప్పి ఫిబ్రవరి 1980లో జరిగిన హిందీ ప్రచార సభ వారి పరీక్షలలో విద్యాలయము నుండి హాజరయి ఉత్తీర్ణులయిన విద్యార్థుల వివరములు తెలియజేసినారు. వందన సమర్పణానంతరము జనగణమన సభ ముగిసింది.

## హిందీ ప్రేమిమండలి పరీక్షా కేంద్ర— రజతోత్సవము, ఈతముక్కల

ప్రకాశం జిల్లా, ఈతముక్కల గ్రామంలో 15-8-80న పరిక్షాకేంద్ర రజతోత్సవము, ప్రమాణ పత్ర వితరణోత్సవము, మరియు స్వాతంత్ర దినోత్సవము వైభవముగా జరిగినవి.

ఉదయం 9 గంటలకు మండలి ఆవరణలో శ్రీ జి. తిరుమలయ్యగారు, పరీక్షా వ్యవస్థాపకులు, ద భా. హిందీ ప్రచారసభ (ఆంధ్ర) హైదరాబాదు, వారి పర్యవేక్షణలో శ్రీసత్యనారాయణ పూజ మరియు సరస్వతి పూజ విద్యాలయ సంచాలకులు కె. వీరభద్ర రావుగారు దంపతి సమేతముగా చేసిరి. గ్రామ



దీ. 15-8-1980 నాడు ఈతముక్కల హిందీ పరీక్షాకేంద్ర రజతోత్సవ సంచర్భమున శ్రీ గోదా తిరుమలయ్య గారిని సభాధ్యక్షులు శ్రీ ఉర్చి కోటిరెడ్డిగారు సన్మానిస్తున్న చిత్రం. ఇందులో హెడ్మాష్టరు శ్రీ డి. మోహనరావు గారిని, హిందీ విద్యాలయ సంచాలకులు శ్రీ కె. వీరభద్రరావుగారిని కూడ చూడవచ్చును.

పెద్దలు, విద్యార్థి-విద్యార్థినులు ఎక్కువ సంఖ్యలో హాజరు అయి పూజ కార్యక్రమమును జయప్రదము గావించిరి.

సాయంకాలము 7 గంటలకు మంగళ వాద్యములతో సమ్మానితులు "శ్రీ జి. తిరుమలయ్యగార్ని," తదితరులను సభా మండపము వరకు తీసుకువెళ్ళబడినది. సభ 7-15 ని॥ ప్రారంభమైనది. స్థానిక హైస్కూలు హిందీ పండితులు శ్రీ డి. అప్పారావు గారు సభికులను ఆహ్వానించిగా "శ్రీ ఉర్చికోటిరెడ్డి గారు" సభాధ్యక్షులుగా స్థానము అలంకరించిరి. విద్యాలయ విద్యార్థినీలు హిందీలో- ''గాయియె గణపతి'' ప్రార్థన గీతముతో సభ ప్రారంభమైనది.

మొదట శ్రీ డి. అప్పారావుగారు రాష్ట్ర ముఖ్య మంత్రి గౌ॥ డాక్టర్ యం. చెన్నారెడ్డిగారు, ద. భా. హిందీ ప్రచారసభ, మద్రాసు – ప్రధాన కార్యదర్శి శ్రీ వి. రాధాకృష్ణమూర్తిగారు; ద. భా. హిందీ ప్రచారసభ, తిరుచ్చిశాఖ కార్యదర్శి శ్రీ వి. యస్. రాధాకృష్ణమూర్తిగారు, శ్రీ చెల్లమ్‌గార్లు పంపిన శుభాకాంక్షలతో కూడిన సందేశములను సభికులకు చదివి వినిపించిరి. తదుపరి విద్యాలయ ప్రచారకులు, సంచాలకులు శ్రీ కె. వీరభద్రరావు తమ నివేదికలో మండలి కార్యక్రమాలను, ఆర్థిక ఇబ్బందులను ప్రజల సహకారమును గురించి వివరించి

ద.భా. హిందీ ప్రచారసభ వారి చేయూత, సహకారములకై కృతజ్ఞతాభివందనములు తెలిపిరి.

సమ్మానితులు శ్రీ జి. తిరుమలయ్యగార్ని "(పరీక్షా వ్యవస్థాపకులు) శైవ ఆగమ పండిట్; శతప్రతిష్ఠా చార్య. ''శ్రీ మడనూరు చెంచు సుబ్బయ్య గురుకులు గారు'' వేద పఠనము గావింప, మంగళవాద్యములు ప్రయోగుమండగా సభాధ్యక్షులు ''శ్రీ ఉర్చి కోటిరెడ్డి గారు'' చందన, ఫల, పుష్ప నూతన వస్త్రములచే సమ్మానము చేసిరి.

తదుపరి "శ్రీ సామంతుల వెంకట సుబ్బారెడ్డి గారు." తమ ఉపన్యాసములో మండలి కార్యదీక్ష, దాని ప్రచార స్వరూపము ఆర్థిక ఇబ్బందులను గురించి చెపుతూ ఇది ఇంకా వృద్ధిలోనికి రావాలి అని, గ్రామస్థుల సహకారం పూర్తిగా కావాలి అని, హిందీ అందరు నేర్వతగిన సులభమైన భాష అని పలికిరి.

శ్రీ డి. మోహనరావు బి ఎ., బి ఇ. డి ప్రధాన ఉపాధ్యాయులు, పరిక్షా కేంద్ర సంచాలకులు: తమ ఉపన్యాసములో ఈ మండలి కృషి ఫలితము వలనే ఉన్నత పాఠశాల స్థాయినుండి కళాసాల స్థాయివరకు విద్యార్థులు హిందీలో ఎక్కువ మార్కులు సంపాదించ కల్గుచున్నారు అని, దీనిపేరు వృద్ధిలోనికి తెచ్చినారని, పెద్దలు కూడ తీరిక వేళలో హిందీ నేర్వవచ్చు అని పలికిరి.

సమ్మానితులు "శ్రీ జి. తిరుమలయ్యగారు" తమ ఉపన్యాసములో తొలుత, ''హిందీ ప్రచార సభను గురించి, దాని లక్ష్యం గురించి గ్రామస్థులకు విపులముగా వివరించి హిందీ భాష ఆవశ్యకతను గురించి దాని ప్రచారమునకై రాష్ట్రములోని ప్రచారకుల నిస్వార్థ సేవ గురించి వివరించిరి. మండలి కార్యదీక్ష, చిన్న వయస్సులోనే హిందీ ప్రచార కార్యమును చేపట్టి పట్టుదలతో కృషి చేయుచున్న ప్రచారక్ కె. వీరభద్రరావును అభినందించి తమకు ఈ విధముగానె ఇంకా వృద్ధిలోనికి వచ్చి స్వర్ణ ఉత్సవము చూడాలి అని ఆశీస్సులు ఇచ్చిరి.

తదుపరి 1980 ఫిబ్రవరిలో ఉత్తీర్ణులైన ప్రాథమిక నుండి విశారద వరకు విద్యార్థులకు ప్రమాణ పత్రములు, బహుమతులు శ్రీ జి. తిరుమలయ్యగారు ఇచ్చిరి.

చివర శ్రీ డి. అప్పారావుగారు వందన సమర్పణ చేయగా రాత్రి 9.30 గం॥ జాతీయ గీతముతో సభ ముగిసినది.

## ''ప్రమాణపత్ర వితరణోత్సవము''

## నెహ్రూ హిందీ విద్యాలయము, కాకినాడ

15-8-1980 సం॥ తేదీ స్వాతంత్ర్య దినోత్సవ దినమున నెహ్రూ హిందీ విద్యాలయములో 1979 ఆగష్టు, 1980 సం॥ ఫిబ్రవరిలో ఉత్తీర్ణులు అయిన ప్రాథమిక నుండి ప్రవీణ వరకు విద్యార్థులకు ప్రమాణ పత్రములు పంచబడినవి. నాటి సభకు ప్రముఖ గాంధేయ వాదులు ఖద్దరు ప్రచారకులు, గాంధీనగరం మునిసిపల్ హైస్కూలు గ్రేడ్ 1 హిందీ ఉపాధ్యాయులైన శ్రీ కే. సీతారామయ్యగారు అధ్యక్షత వహించిరి. నెహ్రూ హిందీ విద్యాలయము ప్రిన్సిపాల్‌గారైన శ్రీ కాపగంటి సుబ్రహ్మణ్యంగారు పెద్దలందరను వేదిక మీదకు ఆహ్వానించిరి. శ్రీ కే. సీతారామయ్యగారు, శ్రీ చక్కా సూర్యనారాయణ బి కాం, బి.ఎల్. గారు, శ్రీ పి. జోసెఫ్ దేవదాస్‌గారు, శ్రీ వి వి. సూర్యనారాయణమూర్తిగారు, ప్రముఖ వ్యాపారస్థులు శ్రీ వాడకట్టు సత్యనారాయణమూర్తి బి. ఎస్. సి. గారు, హిందీ యొక్క ఉపయోగతను గూర్చి చక్కగా భాషించిరి. పాఠశాల ప్రిన్సిపాల్ కే. సుబ్రహ్మణ్యంగారు పాఠశాల నివేదికను చదివి వినిపించిరి.

1979 సం, ఆగష్టు, 1980 సం, ఫిబ్రవరి సంవత్సరములో ఉత్తీర్ణులైన వారికి శ్రీ చక్కా సూర్య నారాయణ బి.కామ్,బి.ఎల్ గారు ప్రమాణ పత్రములు పంచిరి. ఈ రెండు పరీక్ష లందును ప్రథమ శ్రేణిలో మరియు ద్వితీయ శ్రేణిలో ఎక్కువ మార్కులు వచ్చిన వారికి విద్యాలయ ప్రిన్సిపాల్‌గారు బహుమతులను శ్రీ వాడకట్టు సత్యనారాయణ బి.ఎస్ సి. గారి చేత యిప్పించిరి. పిమ్మట అల్పాహార విందు జరిగినది. "జనగణ మన" అను గీతముతో సభ ముగిసినది.

## హిందీ ప్రమాణపత్ర వితరణోత్సవం

## బురకాయలకోట

15-8-1980 శుక్రవారము ఉ॥ 7-15 గంటలకు చిత్తూరు జిల్లా బురకాయలకోట జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో స్వాతంత్ర్య దినోత్సవము జరిగెను. కుమారి ఎస్. శైలజ, డి. సుధారాణిల ప్రార్థనతో సభ ప్రారంభమయ్యెను సభకు శ్రీ పి వి రామకృష్ణారావు గారు ఇండియన్ బ్యాంక్ మేనేజరు అధ్యక్షత వహించిరి. శ్రీ డి. సుబ్రమణ్యంగారు జండాను ఆవిష్కరించిరి.

అధ్యక్షులు స్వాతంత్ర్యమునకై మన నాయకులు చేసిన త్యాగములను గూర్చి వివరించుచు గాంధీగారు హిందీని ప్రవేశపెట్టుటలో గల ఉద్దేశ్యమును వివరించిరి. తదుపరి శ్రీ జి. వి చలపతి, శ్రీ వై. ఆదినారాయణరెడ్డి గార్లు స్వాతంత్ర్య దినోత్సవ సందర్భములో మాట్లాడుతూ గాంధీ మహాత్ముల కార్య క్రమములో హిందీ ప్రచారము కూడ ఒకటని వివరించి, హిందీ భాషను నేర్చుకొనుటకు ప్రోత్సహించిరి. శ్రీ పి.వి రామకృష్ణారావు గారు 1980 ఫిబ్రవరిలో జరిగిన హిందీ ప్రమాణ పత్రములను ఉత్తీర్ణులైన విద్యార్థులకు బహూకరించిరి స్థానిక హిందీ ప్రచారకులు శ్రీ వై. శిద్దారెడ్డిగారు వందన సమర్పణ చేయగా జాతీయ గీతముతో సభ ముగిసెను. తదనంతరము బాల బాలికలకు మిఠాయిలు పంచిపెట్టబడెను.

## హిందీ మహావిద్యాలయం, గూడూరు

13-8-80 నాడు సాయంకాలం గూడూరు-జిల్లా పరిషత్ బాలికోన్నత పాఠశాలలో హిందీ మహావిద్యాలయ తరగతుల సమాపనోత్సవం (ఆగస్టు-1980), విజయ పత్ర ప్రదానం గూడూరు రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్ శ్రీ సి.యస్. గోపీనాధరెడ్డి అధ్యక్షతన జరిగింది. హిందీ మహా విద్యాలయ ప్రిన్సిపాల్ శ్రీ సుంకర చంగయ్య స్వాగతం పలికారు. అధ్యక్షులు సభను ప్రారంభిస్తూ "ఈనాడు ఇంత అధిక సంఖ్యలో హిందీ భాషాధ్యయనం చేసే విద్యార్థినీ, విద్యార్థులను చూడటం చాలా ఆనందదాయకంగా ఉంది. నేడు విద్యా విధానంలో త్రిభాషా సూత్రం అమలు జరుగుతూఉంది. ఒక భాషను సమగ్రంగా అధ్యయనం చేసినప్పుడు దాని సహాయంతో ఇతర భాషలను ఎన్నింటినైనా గ్రహించటం సులభం. హిందీభాషను సమగ్రంగా అధ్యయనం చేయటానికి ప్రయత్నించాలి విద్యార్థులకు క్రమశిక్షణ ప్రధానమైంది. దేశస్వాతంత్ర్యానికి కృషి చేసిన పెద్దల క్రమశిక్షణను మనం ఆదర్శంగా స్వీకరించాలి" అని పలికారు

స్థానిక ప్రభుత్వ కళాశాల హిందీ భాషోపన్యాసకులు శ్రీ జి రాములు 'ప్రేమ్‌చంద్' సాహిత్యాన్ని వివరించారు. శ్రీ బి. రంగాచార్యులు ప్రసంగిస్తూ "గాంధీ సందేశాన్ని స్వీకరించి నేటివరకు శ్రీ చంగయ్య హిందీ భాషోద్యమానికి చేస్తున్న కృషిని ప్రశంసించారు. జిల్లా ఉపవిద్యాశాఖాకారి శ్రీ సత్తార్‌బేగ్, శ్రీ గుద్దేటి వీరసుబ్బమ్మ, శ్రీ బత్తెన రాఘవయ్య శ్రీ రామచంద్ర అగ్రవాల్ ఉపన్యసించారు.

బాలికోన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయిని శ్రీమతి పి. ధనమణి విజయపత్ర ప్రదానం చేశారు. శ్రీ సుంకర చంగయ్య వందన సమర్పణానంతరం జాతీయగీతంతో సభ ముగిసింది.

# దేశాన్నంతటినీ ఒకటిగా ఉంచడానికి సూత్రం వంటిది హిందీ

హైదరాబాదు, ఆగస్టు 20: హైదరాబాదు హిందీ ప్రేమీ మండలి ఆధ్వర్యాన హైదరాబాదులోని ద. భా. హిం. ప్రచార సభ భవనంలో విజయపత్ర ప్రదానోత్సవం జరిగింది. ముఖ్యఅతిథిగా రాష్ట్ర గ్రామీణాభివృద్ధిశాఖా మంత్రి శ్రీ పరకాల శేషావతారం మాట్లాడుతూ అనేక భాషలకు కూడలియైన భారతదేశాని కంతటిని ఒకటిగా కలిపి వుంచటానికి హిందీ భాష సూత్రం వంటిదని, జాతీయ సమైక్యత దృష్ట్యానూ, రాజకీయాలలో చురుకుగా పాల్గొనదలచిననూ హిందీ నేర్వటం తప్పనిసరి యని; రాష్ట్రంలో హిందీ అభివృద్ధికి ప్రభుత్వం అనేక చర్యలు తీసుకొంటుందని చెప్పారు. విద్యార్థులకు బహుమతి ప్రదానం కావించారు

సభకు అధ్యక్షత వహించిన ఆంధ్ర టెలీకమ్యూనికేషన్ల జనరల్ మేనేజరు శ్రీ టి. హనుమాన్ చౌదరి గారు హిందీలో మాట్లాడుతూ హిందీ నేర్చుకోవలసిన అవసరాన్ని తెలియజేస్తూ, అభిలాష అభిరుచులతో స్వచ్ఛందంగా హిందీని నేర్చుకోవాలని విద్యార్థులకు ఉపదేశించారు. విద్యార్థులకు ప్రమాణ పత్రాలను అందచేశారు.

ద. భా. హిం. ప్రచార సభ, ఆంధ్ర కార్యదర్శి శ్రీ చి సుబ్రహ్మణ్యంగారు మాట్లాడుతూ ఆంధ్ర నుండి ప్రతి సంవత్సరం దాదాపు 85 వేల మంది హిందీ పరీక్షలకు కూర్చుంటున్నారని చెప్పారు.



అమాత్యులు, శ్రీ పరకాల శేషావతారంగారు ఉపన్యాసిస్తున్నారు.

ఆంధ్ర సభ ఉపాధ్యక్షులు శ్రీ శీర్ల బ్రహ్మయ్యగారు, ఎమ్. ఎల్. సి , శ్రీ కె. బాలసుబ్బరావుగారు ఉపన్యసించినారు.

హిందీ ప్రేమీ మండలి అధ్యక్షులు శ్రీ చవాకుల నరసింహమూర్తి తమ స్వాగతోపన్యాసములో మండలి నిర్వహణను గురించి వివరించారు.కార్యదర్శి శ్రీ ఐ.వి. రామస్వామి కృతజ్ఞతలు తెలిపారు.



ది. 21-8-1980 గురువారం నాడు శ్రీ వెంకటేశ్వర హిందీ మహా విద్యాలయం, విజయనగర కాలనీ, హైదరాబాద్ సత్రాంతోత్సవం హిందీ పి జి. కాంప్లెక్సు, హైదరాబాద్ రిజిష్ట్రార్ శ్రీ వేమూరి ఆంజనేయశర్మగారి అధ్యక్షతన జరిగింది. ఆంధ్రప్రదేశ్ సాంకేతిక విద్యాశాఖామాత్యులు గౌ॥ శ్రీ టి. హయగ్రీవాచారిగారు ముఖ్య అతిథిగా విచ్చేశారు. పై చిత్రంలో మంత్రివర్యులు శ్రీ హయగ్రీవాచారిగారు ఉపన్యసిస్తున్నారు. క్రింది చిత్రంలో ఆంధ్రసభ అధ్యక్షులు శ్రీ ఎమ్. వి. పాపన్నగారు మాట్లాడుతున్నారు. చిత్రాలలో సభాధ్యక్షులు శ్రీ వేమూరి ఆంజనేయశర్మగారు, విద్యాలయ ప్రధానోపాధ్యాయులు శ్రీ చవాకుల నరసింహమూర్తిగారు ఉన్నారు.



గన్నవరం విశ్వదాత హిందీ విద్యాలయం విద్యార్థినీ విద్యార్థులు 1980 అగష్టు పరీక్షల ముగింపు ఉత్సవం సందర్భములో ఉపాధ్యాయిని నగ్రాబేబీ సరోజిని, విజయవాడ హిందీ మహా విద్యాలయం ప్రిన్సిపాల్, కాజ వెంకటేశ్వరరావుగార్లతో తీయించుకొన్న ఛాయా చిత్రము.

# 1980 నవంబరు – హిందీ పరిచయ పరీక్ష

## దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర, హైదరాబాద్

| | |
|---|---|
| హిందీ పరిచయ పరీక్షా శుల్కం | రు. 2-50 |
| పాఠ్య పుస్తకములు:- | |
| 1. హిందీ పరిచయ | 0-80 |
| 2. హిందీ తెలుగు బాల బోధిని | 1-00 |

### పరీక్షా కార్యక్రమము

| | |
|---|---|
| పరీక్షార్థుల సూచీ మరియు పరీక్షా శుల్కం స్వీకరించు చివరి తేదీ | 30-10-1980 |
| పరీక్షా సామగ్రి సంచాలకుని వద్దకు పంపు తేదీ | 8-11-1980 |
| పరీక్ష తేదీ | 16-11-1980 |

త్తర ప్రత్యుత్తరముల చిరునామా:-

దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర

ఖైరతాబాదు, హైదరాబాదు-500 004

కార్యదర్శి



దీ. 28-8-1980 నాడు జరిగిన విజయవాడ హిందీ మహా విద్యాలయం స్వాతంత్ర్యోత్సవ సందర్భంలో తీయబడిన ఛాయా చిత్రం. ఆంధ్ర సభ కార్యదర్శి-శ్రీ చిర్రావూరి సుబ్రహ్మణ్యం, విద్యాలయ ప్రిన్సిపాల్ శ్రీ కాజ వెంకటేశ్వరరావు, ప్రచారక విద్యాలయం ప్రిన్సిపాల్ శ్రీ మిక్కిలినేని సుబ్బారావు, శాఖా కార్యాలయం వ్యవస్థాపకులు శ్రీ పి. ప్రసాదరావుగార్లను విద్యాలయ తదితర ఉపాధ్యాయులను విద్యార్థినీ విద్యార్థులను చిత్రంలో చూడవచ్చును.

## दक्षिण भारत हिन्दी प्रचार सभा, मद्रास

# प्रमाणित प्रचारक योजना

दक्षिण भारत हिन्दी प्रचार सभा के विकास में शुरू से दक्षिण के चारों राज्यों के हजारों कर्मठ हिन्दी प्रचारकों और प्रचारिकाओं का हाथ रहा है। इन प्रचारक व प्रचारिकाओं को संगठित करने, उनके कार्य में सहयोग देने और उन्हें अधिकाधिक प्रोत्साहित करने के उद्देश्य से प्रचारक योजना बनायी गयी है। यह योजना सफलतापूर्वक चल रही है। वर्तमान परिस्थितियों को दृष्टि में रख कर दक्षिण भारत हिन्दी प्रचार सभा, मद्रास की कार्यकारिणी समिति ने इस योजना को और सक्रिय बनाने के लक्ष्य से निम्नलिखित निर्णय किये हैं।

1. दक्षिण भारत के आन्ध्र प्रदेश, तमिलनाडु, केरल तथा कर्नाटक राज्यों के 10,000 सक्रिय हिन्दी प्रचारक व प्रचारिकाओं को प्रमाणित प्रचारक योजनान्तर्गत लाने, और उन्हें संगठित करने का अभियान चलाया जायगा।

2. ता. 1 जनवरी 1981 से प्रमाणित प्रचारक चंदा वार्षिक 10 रुपये रहेगा।

3. ता. 30 नवंबर 1980 तक प्रमाणित प्रचारक चंदा 10 रुपये 1981 के लिए सभा को भेज देंगे।

4. सभा की ओर से प्रकाशित दैनिकी (डायरी) सभा के खर्चे पर सभी प्रमाणित प्रचारकों को ता. 31 दिसंबर 1980 तक भेजी जाएगी। डाक व्यय अलग रूप से नहीं लिया जाएगा।

5. सभा का मुख पत्र हिन्दी प्रचार समाचार हर मास प्रमाणित प्रचारकों को मुफ्त में भेजा जाएगा।

6. सभा के प्रमाणित प्रचारकों को सभा की परीक्षाओं के लिए परीक्षक बनाया जाएगा।

7. परीक्षार्थियों के आवेदन पत्रों पर प्रमाणित प्रचारकों को हस्ताक्षर करने का अधिकार रहेगा।

8. सभा की ओर से प्रकाशित पुस्तकों के लिए बाकायदा कमीशन प्रमाणित प्रचारकों को दिया जाएगा।

9. शिक्षा परिषद के लिए उम्मीदवार बनने और मत देने का अधिकार प्रमाणित प्रचारकों को रहेगा।

10. सभा के समाचार समय-समय पर प्रमाणित प्रचारकों को भेजे जाएँगे।

इस योजना को सफल बनाने में प्रांतीय शाखाओं के सचिवों, संघटकों, कार्यकर्ताओं और उत्साही कर्मठ प्रचारकों एवं प्रचारिकाओं का सहयोग अपेक्षित है।

मद्रास
ता. 15-7-80

वे० राधाकृष्णमूर्ति
प्रधान सचिव

Edited, Printed and Published by Ch. Subrahmanyam, on behalf of the D. B. Hindi Parachr Sabha-Andhra, 959, Khairatabad, Hyd-4. and Printed at Dakshina Bharat Press, Hyd-4.